సాటి స్త్రీకి జరిగిన అన్యాయాన్ని ఎదుర్కొని ఒంటరిగాపోరాడి

న్యాయం సమకూర్చిన అతివ ఆదర్శ గాథ!

ఉత్తమ చిత్ర

# మనసు-మాంగల్యం

నిర్మాత
కోగంటి కుటుంబరావు

సంగీతం: పెండ్యాల
రచన: ఆచార్య ఆత్రేయ

దర్శకత్వం
కె. ప్రత్యగాత్మ



## రాజధాని కబుర్లు

22—1—71 సంచికలో—అధికార కాంగ్రెస్ రాజకీయాలలో తెలంగాణా అన్న వ్యాసం ఆ వ్యక్తులకు కనువిప్పు కాగలిగితే మంచిదే. అయితే తన స్వప్రయోజనాలకు ఈ తెలంగాణా సమస్యను శ్రీమతి ఇందిరా నెహ్రూ గాంధి వాడుకుంటున్నంతకాలం పరిష్కార రాజకీయ పరిష్కారం జరుగుట మనేది ఉండదు. 1969లో ప్రత్యేక తెలంగాణా అన్న సమస్య లేదన్న ఆమె తిరిగి అంతరాత్మ ప్రబోధం ప్రకారం మనస్సు మార్చుకొని 1977 లో పరిస్థితులు ఆధారంగా యిస్తామని ప్రకటించడం ఆమె పరిపాలనా ప్రత్యేకతకి చిహ్నం.

ఇవ్వదల్చుకున్నప్పుడు ఇప్పుడే ఇస్తే మంచిది. ఆంధ్రుల వోట్లు పోతున్నాయన్న భయం అవసరం లేదు. ఎందుకంటే ఆమె చెప్పే సోషలిస్టు ఉపన్యాసాలను దేశప్రజలతో బాటు ఆంధ్రులు కూడా ఇంకా నమ్ముతూనే ఉన్నారు. అయినా ఢిల్లీకి ప్రత్యేక రాష్ట్రం ఇస్తే జనసంఘం వారు ఆమెకి సింహ స్వప్నం లాగా తయారవుతారనే భయం ఉండవచ్చు కానీ ఏది చెప్పినా నమ్మే తెలుగు వారి వల్ల ఆమెకి ఏ ఆపదా లేదు.

ఆంధ్ర ప్రదేశ్ సరిహద్దు లేమిటో తెలియని చరణ్ సింగ్ గారి బి. కె. డి. కూడా ప్రత్యేక తెలంగాణా ఇవ్వాలనటమే ఆశ్చర్యకరం. లక్నోలో కూర్చుని గాంధి గారి టోపీలు పెట్టుకుని తీర్మానాలు చేయుటం కాదు దేశ పరిపాలనమంటే.

ప్రత్యేక తెలంగాణా అనేది తప్పక వస్తుంది. ఇందిరా నెహ్రూ గాంధికి మరీ ఇబ్బందిగా వుంటే 1971 మార్చిలోనే వస్తుంది. అందువల్ల తెలంగాణా వారు ఇప్పటి అల్లర్లు చేయనవసరం లేదు ఎందుకంటే, ఈ సమస్యను చల్లార నివ్వకుండా చూసే నాయకులు ఎటూ ఉన్నారు గనుక.

ఏ. పి. ప్రభాకర కాశీపతి [మద్రాస్]

# ఉత్తరాలు

## సి ని మా

ఉత్తరాలు శీర్షిక విమర్శకులకు, రసజ్ఞులకు చర్చావేదిక కావటడం మహదానందకరం. అందుకు మీరభినందనీయులు. సంక్రాంతి సంచికలో పి. వి. రావుగారి విమర్శకు జవాబు:

రావు గారూ, రామారావుగారిని విమర్శించడం నా లక్ష్యం కాదు. ఆయన చేసిన సేవను ఏకరువు పెట్టారు కాని, నేనుపయోగించిన వాక్యాన్నర్థం చేసుకోలేక పోయారు. ఆయన అభిమానుల్లో మీరొకరైతే— నేను మీ మిత్రుడ్నే సుమండీ! రామన్‌గారి వంటి మహనీయులకు ప్రచారం లేక వారి ప్రతిభకు ప్రోత్సాహం లేకుండా పోతూంది, ఆ ఆవేదనే నాకు మిగిలింది. బాబూలాల్ [నిడదవోలు] గారికి జవాబు: మీకుకూడా పై జవాబే వర్తిస్తుంది. సినిమా నటుడ్నే ఉదాహరణ తీసుకోవన్సి కారణం— ఎక్కువ పబ్లిసిటీ వారికే ఉండటం వల్ల.

అభిమానులు సరిగా అర్థం చేసుకోకపోవడం వల్ల కల్గిన బాధకు చింతిస్తున్నాము.

స్వప్న, [విజయవాడ]

## సీ రి య ల్

గుళ్లపల్లి సుందరమ్మగారి 'అతని లక్ష్యం' సీరియలు సాఫీగా ఆహ్లాదముగా యున్నది.

జేబి మదన్మోహన్ చౌదరి, [కారంచేడు]

*   *   *

కొత్త సీరియల్ అతని లక్ష్యం బాగుంది.

సాంగ్రామం సుబ్బలక్ష్మి [శ్రీకాకుళం]

*   *   *

'అతని లక్ష్యం' సీరియల్‌లో బర్మా ప్రజలు యుద్ధ సమయంలో అనుభవించిన కష్టములను కళ్లకు కట్టినట్లు వర్ణించిన రచయిత్రి గుళ్లపల్లి సుందరమ్మగారికి మా అభినందనములు.

డా. కంచర్ల బాలకృష్ణ, డా. కంచర్ల రత్నకుమారి, [భట్టిప్రోలు,]

*   *   *

ఈవారం పత్రికలో రసపిచ్చి కథ సమ్మోహనం అందరినీ ఆనంద చకితుల్ని చేసింది.

రసగుల్లాలాంటి రసపిచ్చి కథను పత్రిక మాకు అందించింది. దానిలోని రుచి ఆనందం ఆహ్లాదం, నన్నీ ఉత్తరం వ్రాయమని ప్రోత్సహించాయి. కథా విధానం క్రొత్త మార్పులతో హృదయంలో హత్తుకోగల విధంగా రచించారు. వారికి నా అభినందనలు.

—కొంగర ఉమామహేశ్వరరావు, [తెనాలి.]

## క థ లు

శ్రీ వాచస్పతిగారి కథ ఈ జీవితాన్ని ప్రేమించు, చదివాము. నిజంగా సంఘంలో నిమ్న జాతిజీవులు జీవితంలో ఎన్నో ఆశలు సృష్టించుకుని అవి చివరికి అనుభవంలోకి రాకపోయేసరికి ప్రతి నిమిషం ఒక యుగంలాగా నరకయాతన అనుభవిస్తూ, చివరికి

# ఇతను రాజు

క్లాసులో మానిటర్ • క్రికెట్ లో నేర్పరి • ఎంతో చురుకైన వాడు



# అదే, అసలైనదే అతనికి కావాలి

రాజు, తను ఎంతో త్వరగా పెరిగి, అన్నిటిలోను ప్రథముడుగా అవవలెనని తహ తహలాడుతున్నాడు. ఆ ఆశయమును నెరవేర్చుటకు అతని తల్లి రాజుకు ప్రతిరోజు "హార్లిక్స్" ఇస్తుంది — అత్యుత్తమమైన, సాటిలేని "హార్లిక్స్".

పిల్లల పెరుగుదలకు కావలసిన అదనపు పోషణ మరియు ప్రోటీన్ల కోసం ఆమె "హార్లిక్స్" మీద ఆధార పడుతుంది. ఎందుకంటే, "హార్లిక్స్"లో శుద్ధమైన, పూర్తి మీగడ గల పాలు, ఉత్తమమైన గోధుమ మరియు ప్రకృతి సిద్ధమైన ఆరోగ్యకరమగు ఇతర పోషక పదార్థములు ఉన్నాయి. 50 సంవత్సరములకు పైగా డాక్టర్లు "హార్లిక్స్" మీద ఆధారపడుతున్నారు మరియు దాన్ని సిఫారసు చేస్తున్నారు.

మీరు, మీ కుటుంబములోని వారు ఉత్సాహముతో ఉండాలంటే—ప్రతి రోజు "హార్లిక్స్" త్రాగండి. "హార్లిక్స్" ఉత్తమ పోషకత్వమును, అధిక శక్తిని ఇస్తుంది.




## అదే, అసలైనదే 'హార్లిక్స్'

HL 1844 A

"హార్లిక్స్" అనే పేరు రిజిస్టర్ చేయబడిన ట్రేడ్ మార్కు.

ఆయన జీవితంమీద విరక్తి పుట్టేట్లు చేసుకునే కన్నా జీవిత మొక వర ప్రసాదమనీ, జీవితాన్ని ప్రేమిస్తేనేగాని ఆనందంగా జీవించలేమనే సత్యాన్ని కథ ద్వారా తెలియపర్చారు. ఈ కథ వాచస్పతిగారు బాగా వ్రాశారు. వీరికి నా ధన్యవాదాలు.

వి. కృష్ణవేణి, [విశాఖపట్టణం.]



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 5—2—'71
శ్రీసాధారణనామ సం॥ మాఘమాసం॥ శుద్ధ ఏకాదశి
సంపుటము : 64 సంచిక : 23

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
"విచిత్ర దాంపత్యం"లో విజయనిర్మల

కథలు :

| | |
|---|---|
| అపవాదు | — 13 |
| జాలి | — 17 |
| సెలగలు | — 32 |
| బంధ్ | — 48 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| మల్లెలు-ఎర్రగులాబీలు | — 24 |
| అతని లక్ష్యం | — 40 |

వ్యాసాలు, శీర్షికలు, సినిమా:

ఉత్తరాలు—2, ఓపెన్ కార్టూన్ — 5, రాజధాని కబుర్లు — 6, సంజయ ఉవాచ — 7, ముగ్గురు మూర్ఖులు—8, డాక్టర్ కబుర్లు—12, ప్రశ్నావళి—16, రంగులరాట్నం—23, ఆయనగారు — 31, ధర్మపథం — 39, కూరలూ గుణాలూ — 46, వారఫలం — 47, ఒకవారం విపరీతం—54, శేఖావాణి-55, సినిమా—56, మీకు తెలుసా ?- 60, కొత్త రికార్డు, ఆపై ... —63, మీరు మీ మనస్సు—64.


మీ విధేయుడ్ని!
అభ్యర్థి
ఎన్నికలముందు
ఏమో, నువ్వెవరో నాకు తెలియదు.
ఎన్నికయిన అభ్యర్థి
ఎన్నికల తర్వాత


ప్రజల ప్రాథమిక హక్కులు
రాజ్యాంగం
ఈ అడ్డు తొలగిపోవాలి
కష్టతరమైన మార్గం
కులతత్వం
పక్షపాతం


మేకతోలు కప్పుకున్న తోడేలు
సి.పి.ఐ. ఎన్నికల ప్రణాళిక

# రాజధానిలో రోడ్డు ప్రమాదాలు!

ఇటీవల ఒక ప్రధాన పోలీసు అధికారి ఈ రచయితతో మాట్లాడుతూ ఈ రాజధానీ నగరం ముఖ్యమైన సమస్య ఈ నగరం రోడ్లన్నారు. ఆయన అభిప్రాయంలో ఈ నగరం వైశాల్యం ప్రజల రాకపోకల దృష్ట్యా రోడ్ల సంఖ్య చాలా తక్కువ. ఉన్నరోడ్డు కూడా ఏవో కొన్నితప్ప చాలా మటుకు సంకీర్ణమైనవి.

స్వర్గీయ అలపాటి వెంకట్రామయ్య గారు మంత్రిగా నున్న రోజుల్లో హైదరాబాదును చక్కని రూపు రేఖలతో సుందరమైన నగరంగా తీర్చి దిద్దడం తమ ప్రధానాశయంగా చెప్పేవారు. అందుకాయన కొన్ని చర్యలనుకూడా తీసుకున్నారు. కాని ఇతర ఎన్నో కార్యక్రమాల వలె ఇవి కూడా అసంపూర్ణంగానే మిగిలి పోయాయి. ఆయన తీసుకున్న ఒక చర్యమాత్రం పేర్కొనదగినది. అటు ఇటు కల ఫుట్ పాత్‌లను కలుపుతే అసలు రోడ్డుకంటే విశాలంగా ఉన్నవి. ఈ నగరంలో చాలా ఉండేవి. దీనితో అసలు రోడ్డుపైన రద్దీ పెరగడం, వాహనాల కదలిక తగ్గి ఉదయం సాయంత్రం ఎన్నో ప్రమాదాలు జరుగుతూఉండడం పరిపాటిగా వుండేది. అందుకని ఆయన ఫుట్‌పాత్ల వెడల్పును తగ్గించి రోడ్ సైజును, హెచ్చించమని మున్సిపల్ అధికార్లకు ఉత్తర్వులు యిచ్చారు. చాలా రోడ్లపైన ఈ చర్యమూలంగా వాహనాల రాకపోకల వేగం హెచ్చడానికి అవకాశం యేర్పడింది.

ఐతే దీనితో ఇంకో చిక్కు వచ్చింది. ఫుట్‌పాత్లపైన ముఖ్యంగా ఆబిడ్‌రోడ్ — స్టేషన్‌రోడ్— చిక్కడపల్లిలోని ప్రధానమైన రోడ్, నాంపల్లి, సుల్తాన్‌బజార్, గౌలిగూడా లాంటి జన సమ్మర్దం ట్రాఫిక్ హెచ్చుగా ఉన్న స్థలాల్లో ఫుట్‌పాత్లు సంకీర్ణమైపోయి వాటిపైన నడవడమే కష్టమైపోయింది. దీనికితోడు పేవ్‌మెంట్ వ్యాపారస్తుల మినీ షాపులు.

## బాటసార్లే ఎక్కువమంది!

దీని ఫలితం ఏమిటో చూడండి. 1970 సంవత్సరంలో పోలీసుశాఖ రికార్డుల ప్రకారం 244 తీవ్రమైన ట్రాఫిక్ ప్రమాదాలు జరిగాయి. వీటిలో నూట నలుగురు మరణించారు. నూట నలభైమంది గాయపడ్డారు. మరణించిన వారిలో 47 గురు కాలినడకన వెళ్లే బాటసార్లు. గాయపడిన వారిలో ఇలాంటి బాటసార్లు. గాయపడినవారిలో ఇలాంటి వారి సంఖ్య 96. అంటే ప్రమాదాలు వేగంగా పోయే వాహనాల మూలంగా కలిగినా వాటికి గురియైన ప్రాణాలను గోల్పోయేవారు, గాయపడేవారు హెచ్చుగా బాటసార్లే నన్నమాట.

బాటసార్లు ఫుట్‌పాత్లనుపయోగించక పోవడం, రోడ్డుకు మధ్యగా నడవడం రోడ్డుకు ఎడమవేపు నడవడంవలన వెనుకనుంచివస్తున్న వాహనాల సంగతి తెలియక ప్రమాదకరమైన స్థితిలో పడడం, రోడ్డుకు ఒక వైపునుంచి మరో వైపుకు దాటడానికి నిర్దేశించిన స్థలాలనుపయోగించక ఎక్కడ పడితే దాట చూడడం— ఇవి రోడ్ ప్రమాదాలకు ప్రధానమైన కారణాలని ట్రాఫిక్ పోలీసుల భోగట్టా.

ఇదంతా బాగానే ఉందికాని అసలు ఫుట్‌పాత్లు తగినంత విశాలంగా లేకపోతే, ఉన్న వాటిని కూడా దస్తుల దగ్గరనుంచి పూలు, పిన్నులు, జోళ్లు, బనియన్లు జోళ్ల వరకు సమస్తమూ అమ్ముకొనే, చిన్న వ్యాపారస్తులు ఆక్రమించుకొనివుంటే బాటసార్లు అసలు రోడ్‌పైన నడవక ఏం చేస్తారు? క్రితంనెల కాబోలు ఫుట్‌పాత్లను ఆక్రమించుకున్న పళ్లబండి వాళ్లను ఇతర్లను పోలీసులు మ్యునిసిపల్ అధికార్లు తరిమివేశారు. కాని కొన్ని రోజుల తరువాత వాళ్లంతా మళ్లీ తయారయారు. సన్నకారు ఉద్యోగులకు మామూళ్లు అందుతూనే ఉన్నాయి. ట్రాఫిక్ ప్రమాదాలు జరుగుతూనే ఉన్నాయి. వాటికి గురవుతున్న వారిలో హెచ్చు సంఖ్య కాలి నడకను ప్రయాణించవలసిన దురదృష్టవంతులదే.

## సైకిల్ రిక్షాల జోరు

ఈ నగరంలో ట్రాఫిక్ ప్రమాదాలకు లేక ట్రాఫిక్ మందకొడిగా కదలడానికి ముఖ్యమైన కారణం ఇతర ఏ ప్రధానమైన నగరంలోను లేనన్ని సైకిల్ రిక్షాలు ఉండడమే.




సికిందరాబాదు నగరంలో చాలా కాలం ఈ మానవ శకటాలుండేవి కావు. వీటిని నడిపి చాలామంది జీవనోపాధి చేసుకుంటున్నా, ఇది అనాగరికమైనది. తోడి మానవునిపై సవారీ చేసేటటు వంటిదని అప్పుడు వేరుగా నున్న సికిందరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ సభ్యులు అభిప్రాయ పడ్డారు. కాని ఆ నగర పాలక సంఘం, హైదరాబాదు పాలకసంఘంలో చేరిపోయిన తరువాత అక్కడ కూడా వీటిని ప్రవేశ పెట్టారు. అసలు ఈ సైకిల్‌రిక్షాలను ఒక క్రమమైన పద్ధతిలో రద్దుచేసి ఆటో రిక్షాలను ప్రవేశ పెట్టాలనేది కేంద్ర ప్రభుత్వ విధానం. తదనుగుణ్యంగా రాష్ట్ర ప్రభుత్వాలకు మునిసిపాలిటీలకు తాకీదులను కూడా ఇచ్చారు. అంతటితో కేంద్రప్రభుత్వం తమ నాగరికమైన అంతరాత్మను సంతృప్తి చెందిందని వారు భావించిఉంటారు. లేకపోతే వట్టి తాకీదులతో ఏమవుతుంది? [illegible] ఆటోరిక్షాలను [illegible] చేయగలిగారి



కదా. ఆటో రిక్షాలు తగినన్ని దొరకనంత కాలం ప్రజలు సైకిల్ రిక్షాలను వాడక తప్పదు.

నగరంలో ప్రస్తుతం 13000 లకు పైగా సైకిల్ రిక్షాలు ఉన్నాయి. ఇవి లైసెన్సు పొందినట్టివి. పొందనివి చాలా ఉండవచ్చును. ఒక్కొక్క రిక్షాను రోజుకు ఇద్దరేసి వంతుల వారిగా తొక్కుతారు. అంటే 26000 మంది, వారి కుటుంబాలతోసహా 'మొత్తం లక్షకు పైగా జనాభా' వీటిపై తమ జీవనోపాధికే ఆధారపడి జీవిస్తున్నారన్న మాట. వీరేకాక, సైకిల్ రిక్షాలను తయారుచేసే కార్ఖానాలు, వాటిలో పనివారు, రిపేర్లుచేసే మెకానిక్కులు, వారికి ట్యూబుల్లో గాలి కొట్టి, పంచర్లకు రిపేర్లు చేసి ఇచ్చే ఒక మనిషి కార్ఖానాలు [పేవ్‌మెంట్ల పైన] ఎన్నో ఉంటాయి. వీటి నుపయోగించడం ఎంత అనాగరికమైనా, వాటి అవసరం దూరాభారాలు బాగాకల ఈ నగరంలో చాలా ఉంది. పైగా నిరుద్యోగం విలయ తాండవం చేస్తున్న రోజుల్లో ఇంత మందిని నిర్వ్యాపారులుగా చేయబూనడం అమానుషమే ననిపించుకుంటుంది.

కాని ఈ రిక్షాలను నడిపేవారు అసాధ్యులు. వీరికి ప్రమాదం భయమంటూ ఉండదు. రోడ్‌పైన ఎంత సంచారమున్నా సరే సాధ్యమైనంత వేగంగా పోతూ ఉంటారు. వీరి ఉనికి రాకపోకలు, మోటారు బండ్ల వారికి సింహ స్వప్నాలు. వీరు బాగా నిండి ఉన్న తమ బండ్లతో ఎప్పుడు ఎక్కడనుండి ఊడి పడ్తారో మోటార్లు నడిపే వారికి తెలియదు. లెక్కలు తీస్తే ఈ రిక్షాలు మూలంగా సంభవించే ప్రమాదాల సంఖ్య ఏమంత తక్కువగా నుండదు.

## టాక్సీల కొరత

మొదటినుంచీ ఈ నగరంలో వాహనాల కొరత ఉంది. అందుకని ప్రయాణికులు ఉన్న కొద్ది టాక్సీలు ఆటోరిక్షా వాలాల దయా ధర్మాలపై ఆధారపడవలసి ఉంటుంది. రాత్రి ఎనిమిది దాటితే కొన్నికొన్ని ప్రాంతాలలో టాక్సీలు దొరకవు. ఒకవేళ ఉన్నా, వారడిగినంత యిస్తే వస్తామంటారు. హైదరాబాదు రైల్వే స్టేషనులో దిగి కొంతదూరం నడిస్తే తప్ప టాక్సీలు కనపించవు. ఇక మీరు రైలు దిగి వస్తున్నారంటే వేరే బేరం చేసుకోవలసి వుంటుంది. సికిందరాబాదు స్టేషను ఆవరణములో టాక్సీలు ఉంటాయి కాని వాటి ఫ్లాగ్ దించేసి వుంటాయి. అప్పుడు మీరే టాక్సీ డ్రైవరుతో బేరానికి దిగవలసి వుంటుంది. ఉన్నకొద్ది ఆటోల విషయం కూడా అంతే. మద్రాసు సెంట్రల్‌లో దిగగానే

(64వ పేజీ చూడండి)




న్యూఢిల్లీలో ఒక యోగాశ్రమం ఉందిట. అందులో కొన్ని జీప్‌బళ్ళు నిలిపి ఉన్నాయట. వాటికి కొత్త కాంగ్రెసు రంగులు వేసి ఉన్నాయట. వాటిని ఫోటో తియ్యటానికి పూనుకున్నాడట ఒక ఫోటోగ్రాఫర్. అతని పేరు రఘోసింగ్, అతను పనిచేసే పేపరు స్టేట్స్‌మన్.

ఆశ్రమంలో స్వామీజీలు దీనికి అభ్యంతరం చెప్పి, అతన్ని చుట్టుముట్టి అతని కెమెరాని తీసేసుకుంటామన్నారట. వారితోబాటు ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి కుమారుడు శ్రీ సంజయగాంధి కూడా కెమెరా, ఇతర సామగ్రి కావాలనటంతో శ్రీ సింగ్ వాటిని ఇచ్చేశాడుట.




ఈ సంఘటన పత్రికలో వెయ్యకుండా ఉంటేనే కెమెరా తిరిగి ఇవ్వటం జరుగుతుందని శ్రీ సంజయగాంధి బెదిరించారుట.

ఇదంతా జరిగిన తర్వాత ప్రధానమంత్రి కార్యాలయం (సెక్రెటేరియట్) వారు జరిగిన దానికి చింతిస్తున్నామని అన్నారుట. అంతే కాక, ఈ సంఘటన గురించి మర్చిపోతే శ్రీగాంధి కూడా క్షమాపణ చెప్పుకుంటారన్నారుట.

ఈ సందర్భంలో స్టేట్స్‌మన్ పత్రిక కొన్ని ప్రశ్నలు వేస్తోంది—

* శ్రీ సంజయగాంధి చర్యలకి ప్రధాన మంత్రి కార్యాలయంవారు బాధ్యులా?

* కొత్త కాంగ్రెసు రంగులువేసిఉన్న జీప్‌లని ఫోటో తియ్యటం చట్టానికి విరుద్ధమా?

* కెమెరా, సామగ్రిని, చేజిక్కించుకుని, తర్వాత తీసిన బొమ్మలని నాశనం చెయ్యటం ఆస్తిని బలవంతంగా తీసుకొనటం కాదా?

* పత్రికలో రిపోర్టు పడరాదని బేరం పెట్టడం పత్రికల స్వేచ్ఛపట్ల అవజ్ఞ చూపటం కాదా?

* ఏ పత్రికలలో ఏమి పడవలసినదీ, కానిదీ నిర్ణయించే హక్కు, అధికారం శ్రీ సంజయ గాంధికి ఎవరు ఇచ్చారు?

ఇంతకిముందు పత్రికల ఫోటోగ్రాఫర్లకి సంబంధించిన సంఘటనలు జరిగినప్పుడు వెంటనే పోలీసుకేసు రిజిస్టర్ అయిందిట, కాని, ఈ సందర్భంలో మాత్రం అలా జరగలేదుట. ఎందుకు, అని ఢిల్లీ జనసంఘం నాయకుడు శ్రీ కేదారనాద్ సాహ్ని ఢిల్లీ లెఫ్టినెంట్‌గవర్నర్ శ్రీ ఏ. ఎన్. జాని కలుసుకుని అడిగారుట....

యోగాశ్రమంలోని జీప్ బళ్ళు ఎక్కడ నుంచి వచ్చాయి, అన్న ప్రశ్నని కూడా ఇతర రాజకీయ నాయకులు కొందరు వేస్తున్నారట..

అసలు ఈ జీప్‌బళ్ళు ఎక్కడివి? ఇదీ ఒక ముఖ్యమయిన ప్రశ్నే, అంటున్నారుట మరి కొందరు........ [ఇ. వి.]




# కాదు సుమా! కథ కాదు సుమా!!

మహేష్







'ఒక వస్తువును అయిదు రూపాయల రెండు పైసలకు కొని, మూడు రూపాయల డెబ్బై పైసలకు అమ్మిన యెడల లాభమా? నష్టమా?' అని ఒక ఉపాధ్యాయుడు విద్యార్థిని ప్రశ్నించాడు.

'మేష్టారూ! రూపాయల్లో నష్టం వచ్చినా, పైసల్లో లాభంవస్తుంది. అని ఆ విద్యార్థి సమాధానం యిచ్చాడు.

'ఈ సమాధానం యివ్వడంలో ఆ విద్యార్థి చూపించిన అవివేకాన్ని గురించి ప్రత్యేకంగా వివరించ వలసిన అవసరం లేదు. ఇటువంటి అవివేకంతో మన ప్రభుత్వం యెప్పుడు వ్యవహరించింది? అని ప్రశ్నించాడు చిదంబరం.

'మహమ్మదీయుల్లో యిస్మాయిలీలు అనే శాఖ ఒకటి ఉంది. ఆ శాఖకు మత గురువు అయిన ఆగాఖానుకు పూనాలో ఒక భవనం ఉంది దానినే ఆగాఖాన్‌భవనం అంటారు.' అని అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'1942—44 సంవత్సరాల్లో బ్రిటిష్‌ప్రభుత్వం మహాత్మాగాంధీని ఆగాఖాన్ భవనంలో నిర్బంధించింది. ఆ భవనంలోనే మహదేవదేశాయ్, కస్తూర్బా గాంధీ కూడా మరణించారు.

'1969 వ సంవత్సరం ఫిబ్రవరి 23 వ తేదీని ఆగాఖాన్ సదరు భవనాన్ని మహాత్మాగాంధీ స్మృతిచిహ్నంగా మనదేశానికి యిచ్చివేశాడు.'

'అహో! ఏమి ఆగాఖాన్ ఔదార్యం' అంటూ ప్రభుత్వం ఆగాఖాన్‌ను అప్పుడు పొగిడింది. అప్పటి రాష్ట్రపతి జకీర్ హుసేన్, ఉపరాష్ట్రపతి గిరి, యింకా మంత్రులు గవర్నర్లుకూడా ఆ సందర్భంలో తమ సందేశాలను పంపించారు. కాని ఆగాఖాన్ యిన్‌కమ్‌టాక్స్ వ్యవహారాన్ని యెవరైనా గుర్తించు కొన్నారా?' అని చూడామణి ప్రశ్నించి తిరిగి తనే దానినిగురించి వివరించడం ప్రారంభించాడు.'

'1968 వ సంవత్సరం ఆగస్టు 7 వ తేదీని రాజ్యసభలో ఆగాఖాన్ తాలూకు యిన్‌కమ్‌టాక్స్ వ్యవహారాలు బయట పడ్డాయి. అర్జున్‌అరోరా, ఏ.పి. చటర్జీ, లోకనాథ్‌మిశ్రాలు వేసిన ప్రశ్నలకు సమాధానంగా అప్పటి ఉపప్రధాన మంత్రి మొరార్జీదేశాయ్ కొన్నివివరాలు యిచ్చాడు.

'1947 వ సంవత్సరం నుంచి 1957 వ సంవత్సరం వరకు ఆగాఖాన్ చెల్లించవలసిన యిన్‌కమ్‌టాక్స్ బకాయి ఒక కోటి పదకొండులక్షల రూపాయలు ఉంది. ఆగాఖాన్‌కు ఆస్తులమీదవచ్చే ఆదాయాన్ని అంచనా వేయగా ఈ మొత్తం తేలింది.'

ఈ మొత్తం మింజుమలె యిరవై తొమ్మిది లక్షల రూపాయలు మాత్రం ప్రభుత్వానికి వసూలు అయింది. ఈ సమ

## మొగ్గరుమహార్షులు

యంలోనే పూర్వపు ఆగాఖాన్ చని పోయాడు. తరువాత ప్రస్తుతపు ఆగాఖాన్ భారత ప్రధానమంత్రిని కల్సుకొని యీ విషయాన్ని గురించి మాట్లాడాడు. ఇన్‌కమ్‌టాక్స్ విషయంలో ఒక రాజీ ఒప్పందానికి రావడానికి ఆగాఖాన్ అంగీకరించాడు.

తరువాత ఆగాఖాన్ రాజీ ఒప్పందం ప్రకారం యిరవై లక్షల రూపాయలు మాత్రం చెల్లించాడు. ఆగాఖాన్ చెల్లించవలసిన మిగిలిన అరవై ఒక్క లక్ష రూపాయలను భారత ప్రభుత్వం మాఫు చేసింది.

'ఇంతేకాదు ఆ మాఫు చేసిన లెక్కల ప్రకారమే ఆగాఖాన్ తరువాతకూడా యిన్‌కమ్‌టాక్స్ చెల్లిస్తున్నాడు.'

'ఆగాఖాన్‌కు మనదేశంలో ఉన్న శిష్యుల వద్దనుంచి యెంత ఆదాయం వస్తున్నదీ అంచనా వేయడం కష్టం' అనికూడా మొరార్జీ దేశాయ్ వెల్లడించారు.

1947 వ సంవత్సరంనుంచి 1957వ సంవత్సరంవరకు ఆ. ఖాన్ చెల్లించవలసిన యిన్‌కమ్‌టాక్స్‌లో అరవై ఒక్కలక్షల రూపాయలను భారత ప్రభుత్వం రద్దు చేసింది. అంటే సంవత్సరానికి సుమారు ఆరు లక్షల రూపాయలను భారత ప్రభుత్వం ఆగాఖాన్‌కు యిన్‌కమ్‌టాక్స్‌లో మురరా యిస్తున్నది.

1947 వ సంవత్సరంనుంచి యిప్పటి వరకు అయిన యిరవై మూడు సంవత్సరాలకు — సంవత్సరానికి ఆరు లక్షల రూపాయల చొప్పున యీ మొత్తం సుమారు ఒకకోటి నలభై లక్షల రూపాయలు అవుతుంది.

ఒక కోటి నలభై లక్షల రూపాయలను భారత ప్రభుత్వం వద్దనుంచి లాభం పొందిన ఆగాఖాన్ మనదేశానికి ఒక భవనాన్ని యిచ్చాడు. అంటే ఆగాఖాన్ మన వద్దనుంచి తాటిపండు తీసికొని యీతపండు యిచ్చాడు. దీనికే 'ఆహా! యేమి ఆగాఖాన్ ఔదార్యం? అని ప్రభుత్వ నాయకులు ఆగాఖాన్‌ను పొగుడుతున్నారు.

ఈ పరిస్థితిలో మన ప్రభుత్వనాయకులకు —

'రూపాయల్లో నష్టంవచ్చినా, పైసల్లో లాభం వచ్చింది' అని చెప్పిన విద్యార్థికీ తేడా యేమిటి ఉన్నది? అని ప్రశ్నించాడు మాడామణి.

అవును, మన ప్రభుత్వం ఆగాఖాన్‌కు సంవత్సరానికి ఆరులక్షల రూపాయలను ఉచితంగా యిచ్చివేస్తున్నదన్న మాటకదా! ఇదీఒక రకమైన రాజభరణమే. సోషలిజం సూత్రాలకు విరుద్ధంఅని చెప్పి ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ రాజులకు యిస్తున్న రాజభరణాలను రద్దుచేసింది. అయితే ప్రభుత్వం ఆగాఖాన్‌కు యిస్తున్న ఈ రాజభరణం మాట యేమిటి?

ఆగాఖాన్‌కు అనవసరంగా మన ప్రభుత్వం యిస్తున్న ఈ రాజభరణాన్ని రద్దుచేస్తే ఆగాఖాన్ శిష్యులైన మహమ్మదీయులకు కోపంవస్తుంది. ఆ పరిస్థితిలో వారు ఇందిరాగాంధీ పార్టీకి వోటు వేయరు. అందుచేతనే ఇందిరాగాంధీ ఆగాఖాన్ యిన్‌కమ్‌టాక్స్ వ్యవహారంలో జోక్యం చేసికొనలేదు. ఇది పచ్చి అధికార దుర్వినియోగం కాదా? ఇదేనా ఆమెచెప్పే సోషలిజం? అని ప్రశ్నించాడు చిదంబరం.

'సరే, ఇక దీన్ని వదిలెయ్. ఉట్టికి యెగరలేని అమ్మ స్వర్గానికి యెగురుతుందా? అని ఒక తెలుగుసామెత ఉన్నది కదా! ఆ సామెత ఈ ప్రభుత్వానికి ఏలాగ వర్తిస్తుంది?అని ప్రశ్నించాడు చంద్రరావు.

చిన్నపనినే చేయలేని వ్యక్తి పెద్దపనిని చేయగలడా? అనే అర్థంలో ఈ సామెతను వాడుతుంటారు. విక్రమార్కుడు చిలక రూపాన్ని పొందినకథకు సంబంధించిన సామెతగా దీన్ని చెబుతారు. అది వేరే

డాక్టర్ కబుర్లు

## ఎంఫిసీమా

ఇదీ ఉబ్బసం వంటిదే. కాని, ఇది ఎలర్జీ వల్ల వచ్చేది కాదు. ఎలర్జీ అంటే ఏదయినా వస్తువు పడకపోవటం! కొందరికి కొన్ని వాసనలు పడవు. అవి వస్తే ఆస్త్మా కూడా వస్తూ ఉంటుంది. ఊపిరితిత్తులు పెద్దవి అయితే వచ్చే ఉబ్బసాన్ని ఎంఫిసీమా అంటారు.

దీనికి ప్రధానలక్షణం ఊపిరికి కష్టపడటం. అందులోనూ బయటికి వదలటానికి. రాత్రి నిద్రపోయేటప్పుడు ఊపిరితిత్తులలో ద్రవ పదార్థాలు చేరి, గాలిపోరే నాళాలకి అడ్డుపడుతూ ఉండిపోయి, ఉదయం శ్వాసకి ఇబ్బంది పెడ్తాయి.

ఎంఫిసీమా ఉందని డాక్టరు చెప్పినప్పుడు దానికి విరుగుడుగా కొన్ని వ్యాయామాలు చెప్తూ ఉంటాడు.

అవి ఈవిధంగా ఉంటాయి—



* లోపలికి గాలి తీసినప్పుడు పొట్టని లోపలికి లాగకుండా బయటికి తొయ్యాలి. బయటి గాలి వదిలినప్పుడు పొట్టని లోపలికి లాగాలి! ఈవిధంగా ఊపిరి తిత్తులకీ, ఉదరానికీ మధ్యన ఉండే పొర ఒకటి ఊపిరితియ్యటాన్ని తేలిక చేస్తుంది. లోపలికి గాలి తీసినప్పుడు వేగంగానూ, వదిలినప్పుడు మెల్లిగానూ వుండాలి.

* మంచుని, ముందుకి కొంచెం వంగి [బల్ల మీద చేతులు ఆనిస్తే మరీ మంచిది] ఊపిరి తియ్యటం తేలిక. కూర్చున్నప్పుడయినా సరే ముందుకి వంగితే తెరిపిగా ఉంటుంది. పడుకున్నట్లయితే పొట్టమీద చిన్న బరువు ఉంచవచ్చు. దీనికోసం ప్రత్యేకంగా తయారు చేసే బెల్ట్లు కూడా ఉన్నాయి.

— హెచ్. ఎల్. హార్ట్‌వెల్

## ముగ్గురుమూర్ఖులు

విషయం' అని అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

1971 జనవరినెలలో కెనడా ప్రధానమంత్రి ట్రూడూ భారతదేశానికి వచ్చాను 'హిందూ మహాసముద్రంలో రష్యాయొక్క నౌకాదళం ఉన్నట్లు తమవద్ద సాక్ష్యం లేదు' అని భారత ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ ఆ సందర్భంలో కెనడా ప్రధానమంత్రితో చెప్పింది.

'రష్యా నౌకాదళం హిందూ మహాసముద్రంలో ఉన్నట్లు మావద్ద సాక్ష్యం యేమీలేదు కాని సాక్ష్యం ఉన్నట్లయితే యేదోచేసి ఉండేవాళ్లం' అనే ధోరణిలో ప్రధానమంత్రిణి ఇందిరాగాంధి మాట్లాడింది, ఇది యెటువంటి వ్యర్థ ప్రసంగమో ఆలోచించు.

1969 సంవత్సరం డిసెంబరు నెలలో భారతదేశంలో రష్యా జరుపుతున్న చర్చల్లో ఒక ముఖ్యమైన విషయం బయటపడింది.

త్రివేంద్రంలో రష్యా సంస్కృతి కేంద్రం స్థాపించడానికి ఒక భవనాన్ని కడుతున్నారు. ఆ సందర్భంలో భవనంలో ఒక భాగం కూలిపోయింది. అందులో పని చేస్తున్న తొమ్మందుగురు కార్మికులు అప్పుడు చనిపోయారు. ఈ విషయాన్ని భారత దేశంలోని పత్రికలన్నీ ప్రముఖంగా ప్రచురించాయి. దానివలన సదరు భవనానికి సంబంధించిన వివరాలు ప్రజలకు తెలిసాయి.

అంతకు మూడు నాలుగు నెలల ముందు భారతదేశంలోని రష్యా రాయబారి భారత విదేశాంగశాఖ అధికారులను మామూలుగా కల్సుకొన్నాడు. త్రివేంద్రంలో రష్యా సంస్కృతీ కేంద్రం స్థాపించే ఉద్దేశం తమకు ఉన్నట్లుగా అతను విదేశాంగశాఖ అధికారులకు తెలియజేశాడు.

'ఇటుపైని యే విదేశమూ అదనంగా సంస్కృతీ కేంద్రాలు కానీ, గ్రంథాలయాలు కానీ స్థాపించడానికి అనుమతించరాదు, అని భారత ప్రభుత్వం పది సంవత్సరాలకు పూర్వమే నిర్ణయించింది. అందుచేత రష్యా త్రివేంద్రంలో సంస్కృతీ కేంద్రాన్ని స్థాపించడానికి అనుమతి యివ్వడం సాధ్యం కాదు' అని విదేశాంగ శాఖ అధికారులు రష్యా రాయబారికి స్పష్టంగా చెప్పారు.

మన ప్రభుత్వం అనుమతి యివ్వక పోయినాసరే, రష్యా రాయబార వర్గం మన దేశంలోని త్రివేంద్రంలో సంస్కృతి కేంద్రం స్థాపించడానికి పూనుకొన్నది. ఒక భవనాన్ని కొని దాని తిరిగి కట్టడానికి రష్యా ప్రారంభించింది. ఏ అటంకమూ లేకపోయినట్లయితే యీ కట్టడం పూర్తి కూడా అయిపోయేది. కాని సగంలో యీ కట్టడం కూలిపోయి తొమ్మందుగురు కార్మికులు చనిపోయారు. అందులో యీ వ్యవహారము అంతా బయటపడింది. అంతవరకూ రష్యా మన దేశంలో అనుమతి లేకుండా ఒక భవనాన్ని కడుతున్న విషయమే మన ప్రభుత్వానికి తెలియలేదు.

ఈ పరిస్థితిలో

మనదేశంలో రష్యా కడుతున్న భవనాన్ని గురించే తెల్సుకోలేని మన ప్రభుత్వం—

హిందూ మహాసముద్రంలో రష్యా నౌకాబలం ఉన్నట్లు తమవద్ద సాక్ష్యంలేదు' అని ప్రకటించడం యెంత హాస్యాస్పదమో ఆలోచించు. 'ఉట్టికి యెగరలేని అమ్మ స్వర్గానికి యెగురుతుందా?' అనే సామెత ఈ సందర్భంలో మన ప్రభుత్వానికి సరిగ్గా సరిపోలేదా?

'ఈ పనిచేసినది రష్యా కాబట్టి మన దేశంలోని 'అభ్యుదయవాదులు' యెవరూ మాట్లాడలేదు. అమెరికా కాని, యింగ్లాండు కాని యిటువంటి పని చేసినట్లయితే, చాలా గందరగోళం జరిగి ఉండేది 'మనది యింకా వలసదేశమేనని ఈ సామ్రాజ్యవాదులు భావిస్తున్నారు. వీరికి తగిన పాఠం చెప్పాలి' అని 'వామ' పక్షాలు అన్నీ యెంతో గొడవచేసేవి కదా! అన్నాడు చూడామణి.

(ఇంకా ఉంది)




మేముంటున్నది ఓ మోస్తరు యిల్లు. మా నల్గురు బ్రహ్మచారులకు విశాలంగానే ఉంటుంది. నల్గురమూ కలిసిమెలిసి వుంటాము. ఎటొచ్చీ చిక్కంతా మా రావుగాడిదే. వాడికి మహమ్మద్ రఫీ పాటలంటే బలే యిష్టం. ఒక్కోసారి వాడు పాడే ఆ ప్రేమ గీతాలు వింటే బాగానే పాడతాడు అన బుద్ధేస్తుంది. ఎటొచ్చీ చిరాకంతా మధ్యాహ్నం పూట వాడు చేసే ప్రాక్టీసే. అక్కడ వాడి పాట శృతిమించి రాగాన పడుతుంటే యిక్కడ మా కోపంకూడా తారస్థాయి నందుకునేది. కాని వాడితో ఎంత వాదులాడినా వాడు వాడి ప్రాక్టీసు మాత్రం విడిచేవాడు కాదు. ఒక్కోసారి వాడి పీక నులిమి పారేద్దామా అన్నంత కోపంకూడా వచ్చేది. అలా చెప్పాముకూడ. అయినా సరే వాడి ప్రాక్టీసుకు ఏ మాత్రమూ అవరోధం కలగలేదు.

ఆ ఒక విషయంలో ఆ మొండి పట్టుదల తప్ప మిగతా విషయాల్లో వాడంత మంచి మనిషి మరొకడు లేడనుకోవచ్చు. ఒక్కోసారి భోజన సమయంలో వున్నట్టుండి పాట ఎత్తుకునేవాడు. కోపం గొంతుదాకా వచ్చినా, కోపగించుకుంటే లాభం లేదనుకొని 'ఒరేయ్! రావుడూ! బుద్ధి? పరుగెట్టి పాలుతాగే కంటే నిలబడి నీళ్ళు త్రాగటం మేలురా.' అంటే యిప్పుడేం అన్నట్లు కళ్ళతోనే సైగ చేసేవాడు పాట ఏమాత్రం ఆపకుండా.

'ఏంలేదు నాయనా! భోజనం చేసేటప్పుడు కాస్త అలా గొంతుచించుకోడం మానేసి స్థిమితంగా కూర్చొని తిను. అంతలోనూ యిది బ్రహ్మచారుల వంటాయె.' అంటే ఒక్క వుదుటున ఎగిరి 'అందుకేరా చెపుతున్నాను. ముందు తీయటి నా పాట వినండి. ఆ తర్వాతే కషాయంలావున్న ఆ అన్నం మింగేద్దాం, ఆ తియ్యదనంతోపాటు' అనేవాడు. అనడమే తడవు వో విషాదగీతమో వో శృంగార గీతమో పాడేసేవాడు. చచ్చినట్టు వినాల్సిందే మరి. ఏదో వోరోజు తానూ ఆ మహాగాయకుడు రఫీలా అయిపోతానని వాడి నమ్మకం. వాడి నమ్మకం సడలించాలని లేదు కాని కాస్త మధ్యాహ్నం పూట ఆ పడుకునే సమయంలో ప్రశాంతంగా వుండాలని మా కోరిక అంతే. అక్కడికీ చెప్పాము 'ఆ టైములో పాడకురా తండ్రీ' అని. వింటేనా మరి? వహా! యిక మాకు ఆ ప్రశాంతత అనేది వాడి సాంగత్యంలో మాత్రం దొరకదు. వాడికి దూరంగా వుండాలంటే ఆ యింటినుండి బస మార్చెయ్యాలి. అయ్య బాబోయ్! బసమార్చటం ఎలా? అంత తక్కువ ఖరీదుకు మరి అల్లాంటి యిల్లు అన్ని సౌకర్యాలతో ఎక్కడ లభిస్తుంది.

అందుకోనేం. ఆ బాధ పడుతూనే అలాగే గడిపేస్తున్నాము. ఏ నాడైనా కనికరించక పోతాడా మా బాధ చూసి అని. వుహు! మా ఆశ అడియాసే అయ్యింది.

'ఉహు లేదురోయ్ మీరు చాల అదృష్టవంతులన్నట్లు' వో రోజు మధ్యాహ్నం హఠాత్తుగా పాట ఆగిపోయింది. ఆ రోజు మధ్యాహ్నం హాయిగా కంటినిండా కునుకు తీశాము. సాయంత్రం లేస్తూనే వాడిని అభినందించి పారేశాము. వాడికి పార్టీ యిచ్చాము. ఇంతచేసినా వాడు వులకలేదు పలకలేదు. తనకేమీ పట్టనట్లు వూరుకున్నాడు. 'పాపం! దిగులేమో' అనుకున్నాము. కాని వో నాల్గు రోజులయ్యాక

# అపవాదు

వాడి పరిస్థితి మరీ-త అధ్వాన్నంగా మారిపోయింది. అన్నపానీయాలు మానేశాడు. తవలో తనే గొణుక్కునేవాడు. మాకేమీ పాలుపోక, వాడి పరిస్థితి చూశాక 'ఒరేయ్! మాకేం యిబ్బంది లేదు గని హాయిగా ప్రాక్టీసు చేసుకోరా' అన్నాము.

వాడు మావైపు చూసి, విషాదంగా నవ్వి 'ఉహు. మరి నాకంత అదృష్టం లేదురా. అంతా అయిపోయింది' అనేసి వెళ్ళిపోయాడు దేవదాసులా.

మాకేమీ తెలీలేదు. 'ఎవర్నన్నా ప్రేమించిందేమో!' అనుమానం వేసింది; ఛీ! పిచ్చి సన్యాసి. పాడుకోవడం తప్ప యింకోటి చెయ్యలేడు. మరింకేమిటీ?'

చివరికి వాణ్ని గోదారికి తీసికొన్నాం; ఎల్లాగైనా వాడి బాధకు కారణమేమిటో తెల్సుకోవాలని.

'చెప్పలేనురా' విషాదంగా అన్నాడు.

'ఫర్వాలేదు చెప్పు' బలవంతం చేశాము.

'ఊ...అపవాదు వచ్చిందిరా. అందుకే మానేశాను' విరక్తిగా అన్నాడు బాటసారిలా.

ఆశ్చర్యపోయాము.

'నీకు...నీకు అపవాదేమిట్రా? ఎల్లా వచ్చింది? అసలు కారణమేమిటి?' ఒక్కుమ్మడిగా అడిగాము.

తలవంచుకున్నాడు మా రావు. కళ్ళల్లో నీళ్ళు కూడ చిందాయి.

'మరేం లేదురా! ఆ రోజు పక్కింటి గుర్నాధంగారు పిలిచి, నేను వాళ్ళ వుషారాణి కోసమే ప్రేమగీతాలు పాడుతున్నానని, యిల్లా చేసే పంతే యింటి యజమానితో చెప్పి, ఖాళీ చేయిస్తానని చెప్పేడు.' అన్నాడు.

మా అందరికీ కోపం వచ్చేసింది. అసలు అమ్మాయిల వేపే కన్నెత్తి చూడని రావుకా యిల్లాంటి అపవాదు? సహించలేక పోయాము. అప్పటికప్పుడే వెళ్ళి నిలదీసి అడిగాము. 'మీ వుద్దేశ్యం ఏమిటి?' అని.

ఆయన చెప్పిన జవాబు విని అసలు మూర్ఛపోయాము.

'మరేం లేదు బాబులూ! మీరు మీ రావుడిగారితో ఎలా బాధ పడుతున్నారో చూసి జాలేసింది. ఎల్లాగైనా రావుడిగారి పాట మాన్పించాలని పిలిచి చీవాట్లేశాను. కాని మా వుషారాణికి రావుడిగారి పాటలంటే చాల యిష్టం. అందుకోసం వారి పాటలన్నీ మా వుషారాణికే ధారాదత్తం చేస్తారేమో కాస్త అడిగి తెలుసుకోండి నాయనా కట్న కానుకల్లో ఏం తీసిపోము. అన్నీ సవ్యంగా కుదిరితే త్వరలో ముహూర్తాలు పెట్టించుకోవచ్చు. ఏమంటారు?'

ఇంకేమంటాము?!...

'వాడి నోట్టి విరిగి నేతిలో పడ్డది.' అందామా?

అల్లాగే అనుకున్నాం. ●



# ఫాక్టమ్‌ఫాస్‌తో పండిన ద్రాక్షపళ్ళు ఎన్నడూ పుల్లగా వుండవు

అంతేగాదు. వీర్యవంతమైన, బరువైన, కండగల్గిన, పళ్ళు గుత్తులలో కాస్తాయి మీ ద్రాక్ష తోటలకు సంకీర్ణ ఎరువు ఫాక్టమ్‌ఫాస్ వాడి, సఖవైన, ఆరోగ్య వంతమైన, క్రిమికీటక బాధల నిరోధించగల ద్రాక్ష గుత్తులను ఎల్లప్పుడూ పండించండి.

శిఫారసు చేయబడిన రసాయన ఎరువుల మోతాదులు. కిలోగ్రాములలో

| | ఫాక్టమ్ ఫాస్ | సల్ఫేట్ ఆఫ్ పొటాష్ | యూరియా | సూపర్ ఫాస్ఫేట్ |
|---|---|---|---|---|
| ఒక్కొక్క ద్రాక్ష తీగెకు— | 16 - 20 | | | |
| (రెండు కత్తిరింపులకు) | 6 | [illegible] | [illegible] | [illegible] |




ఫాక్ట్ కర్షక బంధు

## ది ఫర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ ట్రావెన్‌కూర్ లిమిటెడ్.
## ఉద్యోగమండల్ - కేరళ

ఆంధ్రప్రదేశ్ ఏరియా ఆఫీసు: షాపూర్‌వాడి, హైదరాబాద -4.

ప్రాంతీయ కార్యాలయాలు:- నిజామాబాద్, వరంగల్, కర్నూలు, నెల్లూరు

aries: EKM.FT.154.TL

సర్కార్స్ మరియు రాయలసీమకు డిస్ట్రిబ్యూటర్లు:

## ది మైసూర్ ఫర్టిలైజర్ కంపెనీ

**ఇ. ఎస్. ఆర్, అనంతపురం**

డుయు బిలీవ్ ఇన్‌గాడ్?

ఐ డు.

డోన్ట్ యు హేవ్ బిలీఫ్ ఇన్ హిందు కస్టమ్స్?

ఐడూ హేవ్......

**వి. డి. జి. ఆర్, (వికటశ్రీ) అనకాపల్లి**

మీ లోకజ్ఞానం ఉందంటే వేవేపే ప్రశ్నలకు జవాబు ఈయగలరా?

ఏదోయ్ నీ ప్రశ్న వికటశ్రీ?!

**పి. ఏ ఎల్. నెల్లూరు**

దిగంబరకవులు మారుపేర్లు పెట్టుకుని తమ రచనలను సాగించడంలో వారి ఉద్దేశ్యం ఏమిటి? వారి సాహిత్యంవల్ల సంఘంలోని కుళ్ళు పోతుందంటారా?

ప్రతి మనిషిలోను అతని అసలు స్వరూపం దీపంలా వెలుగుతూ ఉంటుంది. తన స్వరూపాన్ని మరిచి పోయి వికృతంగా యీనాడు మనిషి పెరుగుతున్నాడు. కృత్రిమ ఆచ్ఛాదనల క్రింద దొంగలా బ్రతుకుతున్నాడు. ఈ దొంగ నాటకానికి యింక తెర వేసెయ్. కానీ ఆసలు రూపానికి అడ్డంగా దించిన ముసుగుని చించెయ్. లే నీ నిజస్వరూపంతో యీ ప్రపంచాన్ని పాలించుకో అంటూ ఆహ్వానించి మాలోని నిజరూపాన్ని దర్శిస్తూ మా చుట్టూ వున్న మనుష్యులందర్నీ ప్రేమిస్తూ వాళ్ళనిగూడా ఆ ప్రయత్నం చేయమంటున్నాం. అందుకే మేం దిగంబరులం అన్నారు దిగంబర కవులు— తమ తొలి కవితా సంపుటిలో. ఇక వారి సాహిత్యం వల్ల సంఘంలోని కుళ్ళు పోతుందా? అన్నది ప్రశ్న కాదు. అనుమానం. పోదు. కుళ్ళు పబ్లిక్ చేసినంత మాత్రాన పోదు. ఇంకా వ్యాపిస్తోంది. దీని కింకేదో మందు వేయాలి.

**ఇ. ఎస్. ఆర్, బరంపురం**

ఎప్పుడూ అనుమానాలతో ఆసూయతో జీవించే వ్యక్తిని ఏమంటారు?

నిత్యశంకితుడు— ఎప్పుడూ నిత్య దుఃఖితుడే.

**పి. ఎస్, శ్రీముఖ లింగం**

మీకు అత్యంత ప్రీతికరమైన గ్రంథం ఏమిటి?

రామాయణం:.

**పి. ఎన్. డి. సాంబల్‌పూరు**

మీరు ఎవరికి దడుస్తారు?

తియ్యగా నమ్మించి వెనక గోతులు తీసేవాళ్ళకి, నోటితో పొగుడుతూ మదుటితో వెక్కిరించే వాళ్ళకి.

**సి. వి. ఆర్. ఎమ్. భీమవరం**

పురుషుడు సుఖం — స్త్రీ శాంతి వాంఛిస్తుందంటారు విజమేనా?




నిజమే. ఒకసారి నిర్ణయం తీసుకున్నాక స్త్రీ ఇక శాంతిగా హాయిగా కాలం వెళ్ళ బుచ్చుదామని అనుకుంటుంది.

**ఈశ్వరయ్య, బొంబాయి**

ఏమండీ రామలక్ష్మిగారూ మంచి మంచి ప్రశ్నలు వదిలేసి చెత్త ప్రశ్నలకు జవాబులిస్తున్నారేమండీ!

ఏం చెప్పను ఈశ్వరయ్యా— నీ కార్డు అందిందని చెప్పడానికేనా నీకు జవాబివ్వాలిగా!—

**ఆర్. డి. కె. జి. ఎమ్**

అయినా మీకేం ఖర్మండీ విప్లవం వర్ధిల్లాలనడానికీ. ఈ బడా బూర్జువా ప్రభుత్వమున్నంత కాలం మీలాంటివారికి ఆ అవసరం ఉండదనడం అతిశయోక్తి కాదేమో.

కాని యీ బడా బూర్జువా ప్రభుత్వం పడ్డాక మటుకు ఒరిగే దేమిటి? విప్లవ బూర్జువాలు గద్దె కెక్కుతారు. మళ్ళీ అంతా మామూలే... దీనికింత బడాయి ఎందుకు? కంటశోష ఎందుకు? గద్దె కెక్కిన విప్లవవాదులు అధికారం చెలాయించరా ఏమిటి?!

**ఇ. వి. ఆర్, హైద్రాబాదు**

సమాన హక్కులంటూ ప్రత్యేక సీట్లు, రిజర్వేషనులు లేడీస్ ఫస్ట్ మొదలైన రూపాలలో మా నెత్తికెక్కుతున్న ఈ ఆడకోతులని దింపే ఉపాయం చెప్పగలరా?

చూడు దురభిమానీ, ఈ జీవిత కాలమే చాలా తక్కువ. అయితే మటుకు దాన్లోనే కొంచెం కర్టసీకి కేటాయిస్తే తప్పులేదు కదూ?

**వి. ఆర్. ఎస్, చేబ్రోలు**

మీతో ప్రత్యక్షంగా మాట్లాడ్డం అంటే భయమేస్తుంది?

పరోక్షంగా మాట్లాడే అలవాటు నాకులేదు— ఏంచేద్దాం?

**ఎ. బి. ఎస్ ఆర్, గూటి**

స్త్రీగా, గృహిణిగా, భార్యగా భార్య విషయంలో భర్తలకు మీరిచ్చే సలహా ఏమిటి?

సాటి మనిషిగా చూస్తే చాలు ఆడదాన్ని.

**డి. ఎల్, గురువాజీపేట**

సినిమా ఫాషన్ అనుకరించే నేటి యువతులందరూ భుజాలుదిగని పమిటలు వేస్తున్నారు. మరి సినిమాలో రోడ్డు ఈడ్చేలా వేస్తున్నారు.

ఫాషన్‌లు వచ్చిపోతూ వుంటాయి. మహారాణి పమిటలు పోయి పిగ్‌టెయిల్ వల్వాలు వచ్చాయి. అప్పుడే ఇవీ తగ్గిపోతున్నాయి. అంచేత ఫాషనులను చూసి బెంగపెట్టుకోవడం దండుగ.

**ఎ. జి. సి హెచ్, పెదచిగుల్లరేవు**

...నాకు మీకంటే కూడా మీ పార్వతీ కృష్ణమూర్తి ఎక్కువ యిష్టం. పార్వతిలో మీరు భాయిగా తొంగిచూస్తూ ఉంటారనిపిస్తుంది నాకు...

మీ అభిమానం అలా అనిపిస్తుంది. థాంక్యూ.

**జి. ఎస్, హైదరాబాదు**

వివాహం చేసుకోని స్త్రీ పురుషులకు సంఘంలో గౌరవస్థానం లేదంటారు? విజమేనా?

ఎందుకు లేరు? కృష్ణమీనన్, నేషనల్ హెరాల్డ్ చలపతిరావు మొదలైన ప్రముఖు లెందరు లేరు?

**జి. వి. ఆర్, మద్రాసు**

మీ ఆధునాతన భావాలని గురించి మీరే పత్రికలో చెప్పుకోవడం చదివాం. ఉదయం మీరు బొట్టుపెట్టుకోరని, భర్తని పేరుతో పిలవడం వగైరా. బహుశ, మీరు చాలా అందవతి అయి వుండాలని...

ఆధునాతన భావాలనకండి— అలవాట్లు అనండి. ఇక బొట్టు పెట్టుకోనని నేనేం మంగమ్మలా శపథం పట్టాననుకుంటున్నారా?— అలవాటు లేదన్నాను— అంతే. అలంకార ప్రాయం బొట్టు అన్నాను. అంతే. ఇకపోతే— భర్తని చెప్పరాని వారిగా, తలచను నేను!.. నేను అందవతినో కాదో పక్క వీధిలో ఉంటూ ప్రశ్న లెందుకు. ఓసారి వచ్చి చూడండి!— మా పక్కనే ఉన్నాడు కుండలవాడు— దడుసుకుంటే— తాయెత్తు కట్టిస్తాను! సరేనా?..

ఇక మా పిల్లల స్వయంవరం సంగతా? కుల గోత్రాలు కాదు ముఖ్యం — శాకాహారి, సంపాదనాపరుడు — సెన్సు ఆఫ్ హ్యూమర్ ఉన్నవాడా— అవీ ముఖ్యం. నా వోటుమీ కు వేస్తాను లెండి.

గడియారం మెప్పుడైనా ఫెయిల్ అవ్వొచ్చు, తిరుగుతుందేమోగాని సత్యనారాయణ జీవితం మాత్రం చాలా రెగ్యులరు. ప్రొద్దున్న లేచాడా అంటే టైము అయిదున్నరన్నమాట. శీతాకాలమేమో బాగా చలిగా ఉంది. ఇంకా చీకటిగానే ఉంది. గాని వీటన్నిటికీ అతీతుడయిన ఇతగాని కార్యక్రమాలు మాత్రం వడివడిగా జరిగిపోతున్నాయి.

అప్పుడే స్నానంచేసి బట్టలేసుకుని వరండా కటకటాల్లోంచి ఇబ్బందిగా చూస్తున్నాడు. రాని పాలవాడిమీద విసుక్కున్నాడు, వీళ్ళకి పంక్చుయాలిటీ అంటే ఏవిటో తెలీదు కదా! ఈ తెలుగు వాళ్ళకి మరీనూ. ప్రక్కభాగంలో ప్లీడరుగారు ఇంకా గుర్రుపెడుతూనే ఉన్నారు. ఏవిటో! వీళ్ళకి టైము విలువ అసలు తెలీదు. తనెప్పుడేనా కాలం వృధాచేసాడా! ఎనిమిదింటిదాకా నిద్రపోయేవాళ్ళంటే రోత. అసలు నేను చాలా గొప్పవాడ్ని. నాకున్నవి చాలా మటుకు మంచిగుణాలే. దేశం బాగుపడాలంటే నాలాంటి వాళ్ళింకా ఉండాలి... ఈవేళ పాలబండీవాడు దేనికో డేష్ కొట్టుంటాడు. ఈ మధ్యన హైద్రాబాదు ట్రాఫిక్ చాలా ఘోరంగా తయారయింది. వెధవలు! సగంపైన తాగితొక్కేవాళ్ళే. జనం ఇలా వ్యసనాల కెందుకు లోనవుతారో? నేనెప్పుడేనా తాగానా. బహుశాః పుట్టుకలోనే కొంతమందికి మంచిగుణాలబ్బుతాయేమో.

ఇంతలో సచ్చనారాయణగారూ అని పిలుపు వినబడింది. అరికాలిమంట నెత్తికెక్కింది. ఈ బృహస్పతికి సత్యనారాయణ అని ఉచ్చరించటంకూడా రాదు. ప్లీడరీ ఎలా వెలగబెడుతున్నాడో. ఆమాటకొస్తే ఎంతమంది ఈపేరుని సరిగా ఏడవగలరు. నాకు మట్టుకు నేను తెలుగువాడ్ని కాదూ! నేను నేర్చుకోలా! ఏవండీ పాలకోసం చూస్తున్నారా! మీకు తెలిదేవిటి ఈరోజున పాలసంఘం వాళ్ళస్ట్రయికట ఈ వాల్టికి కాఫీకి మాయింటికి రండని ప్లీడరుగారు ఆహ్వానించి వెళ్ళారు. 'ఉహూ!!' తనకే పాడిఉందని గొప్ప చెప్పుకోటం కాదూ ఇది? అసలిల్లాంటి వాళ్ళంటే నాకు తగని చిరాకు. అబ్బే టైములేదండీ! ఇంక ఆఫీసుకుపోవాలని

# జాలి

ముక్కవల్లి రామలక్ష్మీ నరసింహమూర్తి



చెప్పి స్కూటరు బయటికి తీసాను.

అమ్మయ్య! ఇప్పుడు హాయిగా ఉంది. ఒకరి జాలిమాత్రం నేను భరించలేను. అసలీ ప్లీడరొకడు, నా దురదృష్టం కొద్దీ దొరికాడు. ప్రతివస్తువ తనకున్నదనీ నాకులేదనీ దృష్టిలోకి తీసుకొచ్చి కించపరచి ఆనందిస్తాడు. ఇలాంటివాళ్ళ కూడా నా లెక్కప్రకారం పాపులే. ఈ పెద్దమనిషికి ఆడంబరాలెక్కువ. పాపిష్టి సొమ్ము వస్తుంది. కారు రిఫ్రిజిరేటరు దగ్గరనుంచి కాష్మీరు తివాసీదాకా అన్నీ కొనేస్తాడు. నిరాడంబర జీవితంలోని మాధుర్యం తెలిస్తేగా. నేను! మరి నేనలా కాదే. ఒకవిధంగా చెప్పాలంటే నేను ఆదర్శ మానవుడ్ని.

ఈ ఆలోచనల్లో ఉండగానే నా స్కూటరు కాలనీ దాటి అప్పుడే షుమారుగా పబ్లిక్‌గార్డెన్సు దాకా వచ్చింది. ... అక్కడ దృశ్యం! వినాయకరావు (పార్ట్నర్ ... స్వాములు) సెక్యూరిటీ ... చరయింది లా...


ఛాంపియన్
శిశువు




ఛాంపియన్
శిశు
ఆహారం


Amulspray
FOOD FOR BABIES

'ఈనెల నా పరిస్థితి అట్టే బాగు లేదోయ్. క్షమించాలి సర్దలేనందుకు' చలపతి వెళ్ళిపోయాడు. అసలయినా వీడికి చపలం బుద్ధేమిటి. ఫామిలీ ప్లానింగ్ అని ఇన్ని సాధనలు కూడా అరుస్తుంటే, రెండో మూడో అనే రోజుల్లో ఇతగాడు నెంబరు 7 కి వెడుతున్నాడు. వెడితే వెళ్ళాడయ్యా ఇలా నిర్మొహమాటంగా నడి రోడ్డుమీద నాలాంటి వాళ్ళందరిని దేవు రించడమే చలపతిగాడికొచ్చే జీతమెంత? ఇటువంటివాడు పెళ్ళెందుకు చేసు కోవాలి. అసలు పెళ్ళివల్ల లాభాలూ, నష్టాలూ బేరీజు వేయండి. పెళ్ళయిన ఒక ఏడాది శరీర సుఖం. ఏం? ఆ మాత్రం ఎక్కడయినా దొరుకుతుంది. తరవాత పిల్లలూ. పెంపకం. విద్య బుద్ధులు చెప్పడం. వాళ్ళతో బాధలు రోగాలూ, రొష్టులూ అన్నీ నష్టాలు కష్టాలు ఇంత చిన్న విషయం గ్రహిం చక తొందరగా పెళ్ళిళ్ళు చేసేసు కుంటారు మరి నేనో! అందరిలా పొర బడకుండా జాగ్రత్త పడ్డాను. 35 ఏళ్ళు వచ్చినా ఏ బాదరబందీ లేకుండా బ్రతుకుతున్నాను.

హలో సర్! రండిసార్! చాలా కాలా నికి వచ్చారిటువేపు అని ఆప్యాయంగా పిలిచాడు శోభనాద్రి. శోభనాద్రి తన ఊరివాడే. బాగా గడించాడని చెప్పు కుంటారు. సుల్తాన్ బజార్లో చివర్లో ఉంది ఇతని బట్టల కొట్టు. సత్యనారా యణ లోపలికెళ్ళి కూర్చున్నాడు. కాఫీ లొచ్చాయి కుశల ప్రశ్నలయినాయి శోభ నాద్రి కాస్త కబుర్లగాడేకాని ఇలాటి ఒంటిగొట్టు రామలింగయ్యలో మాట్లా డ్డానికేం సంగతులుంటాయి. వ్యాపారం విషయాలు కుదరవు. పోనీ పెళ్ళాం బిడ్డలు ఇట్లా పిచ్చాపాటీ అంటే బ్రహ్మ చారాయె. పోని ఏ సినిమా గురించో హస్కు వేద్దామంటే మన వాడికవేం పట్టవాయె ఈ సందర్భంనుంచి రక్షించ డానికా అన్నట్టు వో చక్కని చుక్క ఆ షాపులో అడుగు పెట్టింది. అయస్కాంతం చుట్టూ గుండుసూదుల్లాగా అందరి చూపులూ ఒక్కచోట నిలబడి అంతలూ చిర్నామాట్లా తొడిగి గ్లాసు తీసు వాళ్ళు ఉంచిన బొమ్మల్లా [illegible]

రకంగా. నిజానికి ఆ చిన్నది అందాల బొమ్మ. సహజమైన అందానికి తోడు ముంచి మేకప్పులో ఉందేమొ సినిమా స్టార్లా ఉంది. శోభనాద్రి కాళ్ళు అత నికి తెలియకుండానే చీర్ల సెక్షనికి చీసి కెళ్ళాయి. అతి వినయంగా ఏం కావాలి మేడమ్...వ్యాపారం కూడా మొదలయింది.

ఆమెను చూడగనే తనక్కూడా వో చిన్నరకం షాకు తగిల్నమాట వాస్తవం. కాని ఏదో...ఏదో జ్ఞాపకం వస్తోంది. ఆ...ఆఁ మ, నళిని జ్ఞాపకం వచ్చింది. ఇదే చందం ఇంత అందం లేకపోయినా చామన చాయగా ఉన్నా చాలా నాజూకుగా మెరుపు తీగలాగా ఎవర్నైనా సరే ఇట్టే ఆ కట్టుకునే సోగ కనులతో తిరిగే నళిని జ్ఞాపకం వచ్చింది. ఇద్దరు కలిసే తిరిగారు. ఒక్కసారే బి. ఏ. పాసయ్యారు. ప్రేమించడమనేది జరక్కపోయినా ఆ అమ్మాయంటే ఇష్టమే. కాని నళిని సత్యాన్ని మనస్పూర్తిగా ప్రేమించింది. తనకి నచ్చని గుణాలు కొన్ని ఉన్నాయని రూఢీగా తెలిసికూడా ఆమె మనస్సు మార లేదు ఆడపిల్లకుండే సహజమైన సిగ్గును విడనాడి తలిదండ్రులకు చెప్పింది. తలి దండ్రులివ్వలేనంత కట్నం అడగడంతో ఆ కథ ముగిసింది. ఈ కథ ఇలా దుఃఖాంతం కావడానికి కారణం నళినీ చదువే. ఆ సంగతి నళినీకి దరిమిలా తెలిసింది. చదువుకున్న భార్య కలవాడు తనమీద తను జాలి పడవలసిన గతి వస్తుందని సత్యం దృఢ నమ్మకం. ఆరేళ్ళయిన తర్వాత తనకున్న ఒక్కగా నొక్క స్నేహితుడు రామమూర్తి నళి నిని పెళ్ళి చేసుకున్నాడని తెలిసి రామ మీద జాలిపడ్డాడు. ఎందుకనో పెళ్ళికి వెళ్ళడం మాత్రం పడలేదు. నళినీని చూసి చాలా కాలమయింది...ఏమిటిది సుమారు 20 నిముషాలయింది. చీర్లు కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. ఆ బాలా కుమారికి నచ్చట్లేదు. క్రమ పెత్తనం చేస్తే శోభనాద్రి కూడా చీరలు మోసు కొస్తున్నాడు. సత్యనారాయణకి నిజంగా శోభనాద్రిమీద జాలేసింది. మెల్లిగా [illegible]. శోభనాద్రి [illegible]

గౌరవంగా – [illegible] పడినప్పుడల్లా. అవును మరి! నేనా పీసర్ని కదా! శోభనాద్రి చదువుకో లేదు. నాలాంటి పెద్ద వాళ్ళతో మాట్లాడితే నలుగురిలో వో డాబు దానితో వో రకమయిన తృప్తి. 'పాపం! శోభనాద్రి!' అనుకుని నడక సాగించాడు.

ఆంధ్రప్రదేశ్! రూపాయి, పంజాబ్! ఏభై పైసలు, బెంగాలు! రెండు రూపాయలు అంధ్ర. మహారాష్ట్ర రేపే డ్రా. లక్కీఛాన్స్...ఇన్ని లాటరీ టిక్కట్లు పెట్టుకుని అరుస్తున్నాడు. స్టేట్ కొకటి చొప్పున కొందరూ. ఆఫీసులో అంతా కలిసి సిండికేట్లూ ఇలా రకాలు. ఒకాయిన 3 ఏళ్ళ కూతుర్ని 'అమ్మా రెండు టిక్కట్లు నీ చేత్తో ముట్టు కోమ్మా' అంటున్నాడు. తన చేతులు తోలు కాబోలు, ఆ వచ్చే ప్రైజు ఆ అమ్మాయి ముట్టుకుంటే వచ్చి లేక పోతే పోతుందా! ఏమిటో? పిచ్చి కాకపోతే మోసం రెండు రకాలు—తెలియకా, తెలిసీ. ఇది రెండో రకం. అందుకే తను వీటి జోలికి పోడు.

ఆదేమిటి ఎదురుగుండా కిళ్ళీ దుకాణం దగ్గర అంత మంది గుమిగూడారు ట్రేన్సిస్టరు ఫుల్ వాల్యూములో మొగు తోంది. మాటలు సరిగా అర్థంకాలా. దగ్గరికి వెళ్ళి వో కుర్రాడిని ఏమిటని అడి గితే 'ష్! ఆగవయ్యా పటౌడి 99 విశ్వనాథ్ 97 రన్నులు' అని మళ్ళీ కామెంటరీ వినడంలో నిమగ్నుడై పోయాడు. మరో కుర్రాడు చెప్పాడు. మెల్‌బోర్న్‌లో ఆస్ట్రేలియా, ఇండియా ఆడుతున్న క్రికెట్ టెస్టు మేచ్ట. ఈ క్రికెట్ ఆటవాళ్ళంటే నాకు విపరీత మైన జాలి. మిట్ట మధ్యాన్నాం మల మల మాడిపోతూ 5 గంటలసేపు ఎలా ఆడతారో పాపం. ఈ భాగ్యపు ఆటని చూడ్డానికి టిక్కట్లు కొనుక్కుని మరీ ఆఘోరిస్తారు...'

ఒక్క విషయం! పటౌడీ సెంచరీ కొడితే ఏం ఒరుగుతుంది లేకపోతే కొంపలేం మునుగుతాయి. ఇదే కాదు అపోలో—8 ఎప్పుడు ఎగిరింది? చంద్రునిమీద మొదటి సారి కాలిడిన మానవుడెవరు? చంద్రుని [illegible]? [illegible], ఏమా

రాలు ఎలా విసురుతాయి? కలవ్యాటుల వల్ల ఉపయోగాలేవిటి. రామన్, భాభా, ఖొరానాలు ఎవరూ? భూమి ఎప్పుడు పుట్టింది. మన గ్రహం కాకుండా మరెక్కడైనా మానవుని మనుగడకు ఆస్కారం ఉందా? ఇత్యాది పనికిమాలిన పరిజ్ఞానంవల్ల మనకి ప్రయోజన మేమున్నావుంది? ఏమాత్రమైనా... మా వాడు భానుమూర్తికి వ్యాసాలు మొదటి ప్రాణమైతే ఉ పనికిరాని విజ్ఞానం రెండో ప్రాణం. వీటికోసం రాత్రిం బగళ్లు బుర్ర బద్దలుకొట్టుకుంటారు. దమ్మిడీ లాభం లేకపోయినాసరే. చిత్రమైన మానవులు!

ఇంటికొచ్చేసరికి 8 గంటలయింది. అరే! ఆశ్చర్యం భానుమూర్తి అనుకుంటూండగానే ఊడిపడ్డాడే.

'ఏవిటి ఇలా వచ్చావ్ ఉత్తరమేనా లేకుండా.'

'ఏం లేదు; పూనాలో మా తమ్ముడి పెళ్ళి, దార్లో మా ఆవిడకి హైద్రాబాదు చూపించొచ్చని ఇక్కడ దిగా.'

'ఏది మరి?'

'అనుకోకుండా స్టేషన్లో వాళ్ల స్నేహితురాలు (క్లాస్‌మేట్) కలిసి, బలవంతంచేసి వాళ్లింటికి లాక్కుపోయింది.'

'సరే; ఏవిటి మరి నీ ప్రోగ్రాం?'

'ఏవుందీ, రేపు సిటీ చూసి సాయంకాలం నీ ఇంటికి రావడం రాత్రి మెయిల్లో ప్రయాణం. అయితే ఇంకా నీ చేతి పాకమేనన్నమాట. పెళ్లి చేసుకోరాదుటా?'

'ఏం! ఆ రొంపిలోకి నన్ను దించుదామనా? పెళ్లిచేసుకుని పెళ్ళాన్ని కొంగుకి కట్టుకు తిరుగుతున్నావని నువ్వు పడే ఆరాటం, బాధ చూస్తూంటే నాకో పక్కనుంచి జాలేస్తోంది; దానికి తోడు...'

'సత్యం! చాలా కాలంగా స్నేహితుడివి కదాని ఉపేక్షించా; ఇకను ప్రయోజనం లేదు విను! నువ్వు నామీద, మా కుటుంబాలమీద జాలిపడుతున్నావా! నీ గురించి మన ఊళ్లో అందరూ ఏమనుకుంటారో తెలుసా, ఎంత ఈసడించుకుంటారో తెలుసా, నీకెలా అర్థమవుతుంది? గురివింద గింజకి తన క్రింద నలుపు తనకు తెలియనట్టు నీ లోపాలు తెలుసుకోకుండా ఇతరుల్ని గురించి మాత్రం నీలో నువ్వే విమర్శించుకుని, జాలిపడి దానివల్ల సంక్రమించే తృప్తితో సంతోషిస్తావు. ప్రతి మానవుడూ తోటివానిమీద జాలిపడి అతనిలో లేనిదేదో తనకున్నదని తృప్తి పడతాడు. అయితే ఈ జాలికి కూడా ఒక హద్దంటూ ఉంటుంది. అది మీరితే దానివల్ల కలిగే క్షోభతో జీవితాన్ని తన చేతులతో ధ్వంసం చేసుకున్నవాడవుతాడు. ఈ విషయం తెలిసి కూడా నన్ను ఎన్నిసార్లు మధ్య విమర్శించినా మన స్నేహాన్ని పురస్కరించుకుని అన్నీ దిగమింగాను. కాని ఎలాంటి మనిషినైనా కదిలించే సంఘటనలు సందర్భాలు కొన్నిఉంటాయి. వాటిల్లో భార్యను గురించిన విమర్శ ఒకటి. అతి సున్నితమైన భావాల్ని రెచ్చగొట్టకూడదు. జీవితంలో కష్ట సుఖాల్ని ఎదుర్కొని పోరాటం జరిపే మానవుడుపొందే సౌఖ్యం, మాధుర్యం తృప్తి, బరువు బాధ్యతలు వదిలి యెడారివంటి జీవితం గడిపేవాళ్లకి అర్థంకావడం కష్టం. వాళ్ళ [illegible] చెప్పింది నమ్మకపోతే నీగురించి ఇతరులేమనుకుంటున్నారో నువ్వే స్వయంగా తెలుసుకో.'

'భానూ! నీ ఉపన్యాసంతో నేనేవిధంగానూ చలించబోను. ఒకరి తప్పు ఎత్తి చూపిస్తే నాలుగు ఎదురు చెప్తారు. ఇది లోకసహజం. అసలే నువ్వు వేళాకోళం.'

'సరే నీకు చేతనయితే నే చెప్పింది మర్చిపో. నేను భోజనంచేసే వచ్చాను. రేపు కలుస్తా.'

భాను వెళ్ళాడు కాని అన్నంత తేలిగ్గా మరచిపోలేకపోతున్నాడు. భానుకి అంతఘాటుగా సమాధానం చెప్పినా అతనన్న దాన్లో కొంత నిజం ఉన్నదేమోననే ఊహ నెమ్మదిగా పెరిగి మనసంతా పాకి దొలుస్తోంది. రాత్రి కలత నిద్రేవట్టింది.

ప్రొద్దున్నమాత్రం నియమం ప్రకారం లేచి కాలకృత్యాలు కానిచ్చి ఆఫీసుచేరాడు. ఈరోజు పని సరిగ్గా జరగటంలేదు. భాను మూర్తన్న మాటలు చెవుల్లో రింగుమంటున్నా నళినిని చూస్తేనే ఉత్సాహం మనస్సుకి హాయి కలిగిస్తోంది.

సూరయ్య ఫైళ్లు తీసుకుపోయాడు. లంచ్ టైమైంది. చేతులు కడుక్కుందికి టాయిలెట్‌దగ్గర కొచ్చిన సత్యానికి ప్రక్క వరండాలో సూరయ్య మాటలు వినిపించాయి.

'నిన్న పేంపుజారీకెళ్తే అడవు చెవ్వాపేసరు సత్తినాణ కనబడ్డాడోవ్.'

'ఏంటీ!' ఆ పిచ్చి మాలోకం సినీమా కూడా సూత్తాడా?'

'ఆడిమొకం, ఊరికే అటుగాను పోతుండాడెహె!'



నువ్వు మామూలు మనిషిగా ఉంటేనే మేం ఆనందిస్తాం.'

సత్యనారాయణ కాళ్ళక్రింద భూమి గిర్రున తిరుగుతున్నట్టుంది. చివరికి నళినిచేత అంటే ఒక ఆడదానిచేత తను ఇన్నిమాటలు వినవలసొచ్చిందా. తల వ్రక్కలవుతోంది. ఎంతమంది తనని గాయ పరచినా చలించలేదు కాని నళిని మాటలు అతన్ని పూర్తిగా కలచివేశాయి. చేతులు అతనికి తెలియకుండానే వణుకుతున్నాయి. తను జీవిస్తున్న ప్రపంచం ఒక్కసారిగా అనంతమైన శూన్యంలోకి త్రోసివేయ బడింది.

భానుమూర్తి వచ్చి చూసిన దృశ్యానికి చకితుడైనాడు. ఇతనిలో మార్పువచ్చింది. చాలు!

'నళినీ నువ్వు అతన్ని ఎక్కువగా బాధ పెట్టావు.'

'.........'

'ట్రైన్ టైమయింది, పద, టాక్సీ తీసుకొచ్చాను, వస్తానోయి సత్యం మరి. బాధపడకు ... నువ్వు మారతావని నాకు నమ్మకం వుంది.'

నిజంగానా అన్నట్టు చూసింది నళిని. సత్యం ఏదో చెప్పాడు. గొణిగినట్టుంది. ఎవరికీ సరిగా అర్థం కాలేదు.

ఆరోజు రాత్రి అతనిపాలిట కాళరాత్రి. హృదయం రణరంగమయింది. అతని నమ్మకాలన్నీ వమ్ము. అతను పెంచుకున్న జీవితం తనముందే నేలపాలు. నూతన జీవితం అనుకున్నంత తేలికా ... ఆలోచ న్లతో ఎప్పుడు నిద్రపోయాడో ... అలారం మామూలుగా టైము ప్రకారం మోగింది. దానికి మానవ ప్రపంచంతో పనిలేదు. తనపని తనదే.

మర్నాడు సత్యనారాయణ లేచేసరికి టైము ఏడున్నర!!

మొదటిసారిగా ఇతగాడి జీవిత క్రమం తప్పింది! ●

రంగుల రాజ్యం





# గజ్జి

— దీన్నే ఏమో చిడుము అని కూడా అంటాము. కాళ్ళకి, చేతులకి పట్టిన గజ్జితో దురదతో బాధపడే తీరు ఒక్కొక్కసారి హాస్యాన్ని జాలిని కూడా కల్గిస్తుంది.

గజ్జికి కారణం సూక్ష్మక్రిములు కాదు. కాని అది, సూక్ష్మజీవే. సుమారుగా పాలె పురుగుకు తేలుకు దగ్గరవే. సాధారణంగా కొణుసులు తవటిపురుగులు అంటారు. గుండ్రంగా, తెల్లగా, పొట్టిపొట్టి కాళ్లతో, (నాలుగు జతలు) పల్చగా వుంటాయి. గజ్జి పురుగుని స్కారాప్టిస్ స్కెబీ అంటారు. అచ్చం దీన్నిపోలినవె, కుక్కలు, పిల్కులు, గుర్రాలు—ఇవి చాలావాటి శరీరం మీద ఉంటాయి. మేంజ అనే గజ్జి కల్గిస్తాయి. అయితే యివి ఆయాపోషక జీవులకు బాగా అలవాటవడ మూలాన, ఇతర పోషక జీవుల మీద వాటి ప్రభావం అంతగా కనబడదు.

స్కారాప్టిస్ శరీరం అలంకారంతో అందం గానే ఉంటుంది. చక్కగా సన్నని అడ్డు గీతలుంటాయి. చర్మం మీద సున్నిత మయిన ముళ్ళు, వెంట్రుకలు, ఉంటాయి. అయితే గుడ్డిదే. కళ్ళుండవు. చర్మాన్ని పట్టి వుండడానికి కాళ్ళకు చివర అంటు బిళ్ళ లుంటాయి.

ఆడ స్కారాఫిప్ట్ చర్మం మీద గోతులు తీసి రోజుకు రెండు గుడ్లు పెడుతుంది. సుమారు3—4 డజన్లు పెట్టాక చచ్చి పోతుంది. ఆగొయ్యే దానికి సమాధి. గ్రుడ్ల నించి లార్వాలు వస్తాయి. ఇవి సరూపశాబకాలు. తల్లినే పోలి ఉంటాయి. పాత చర్మాన్ని వదలి పెరుగుతూ వస్తాయి. మొత్తం పెరుగు దలకు 1, 2 వారాలు పడుతుంది. ఎదిగాక నాలుగు వారాలు జీవిస్తాయి.

ఇచ్‌మైట్ అనే ఈ జీవిపిల్లలు మన చర్మం మీద విహారం చేస్తాయి. ముఖ్యంగా రాత్రి పూటల్లో. మగ, ఆడవి కలుసుకున్నాక ఆడవి గోతులు తీసుకుంటాయి. మగవి ఏమవు తాయో కాని, చర్మం మీదనే మరణం చెందు తాయి అని భావిస్తారు.

ఇంతకీ చిడుముతో చాలారోజులుగా బాధ పడుతున్న వారి శరీరంమీద ఎదిగినవి 10 కన్నా ఎక్కువ ఇచ్‌మైట్‌లు ఉండవు. అది వింతే. క్రిములయితే లక్షలు కోట్లు మన శరీరంలో ఉంటాయి. కొత్త క్రిమి మనశరీరం మీద చేరిన కాలాల్లో అయితే 50—500 వరకు ఇవి ఉంటాయి. కాని క్రమంగా 10 వరకు తగ్గిపోతాయి.

ఈ చిడుముతో బాధపడుతున్న వారి శరీరం ఆప్రాంతంలో వాచి ఎర్రగా అవడమూ, తెల్లని చిన్నచిన్న బొబ్బలు ఏర్పడడమూ, జరుగుతుంది. మొదట ఇచ్‌మైట్ మన శరీరం చేరిన ఒక నెలవరకూ ఏమీ అనిపిం చదు. 6 వారాలు అయేసరికి దురద మొద లవుతుంది. నిద్రపట్టదు. శతదినోత్సవం జరిగాక బాధ భరింప శక్యం కాదు. ఇచ్‌మైట్ సంఖ్య తగ్గిపోయినా చర్మం మీద పుండ్లు ఎక్కువయి, చర్మం వాచి, మొద్దుబారి పోతోంది. ఇమ్‌పెటిగో, ఎడిమా సంభ విస్తాయి. పైగా ఇతర రకాల క్రిములు చేరడానికి అవకాశం ఉంది.

శరీరంమీద 85 శాతం వరకూ గజ్జి పురుగు చేతులమీదే వుడుతుంది. కాళ్ళ గజ్జల ప్రాంతాల్లో కూడా కొద్దిగా చేర తాయి. తలకి రావడం చాలా అరుదు. తాకడం కారణంగా ఒకరి నుంచి ఒకరికి చేరు తుంది. పగలు శరీరం మీద, ఉండవు కాబట్టి రాత్రి పూట దగ్గిర దగ్గిరగా పడుకోవడంవల్ల, పక్కబట్టలు, దుస్తులు ద్వారా వ్యాపిస్తాయి.

పూర్వం రక్తం అపరిశుభ్రంగా ఉండడం వల్ల సంభవిస్తుంది అనుకునేవారు. అది తప్పు అని తేలింది. నాగరికత పెరిగి, పరిశుభ్రత పెరగడంలో చాలావరకు ఇది తగ్గిపోయింది.

గంధక మలాము పూతవల్ల ఇది అదుపులో వుంటుంది. అయితే ఒకే ఒకసారి 25% బెంజిల్ బెంజోయేట్ పూతపూస్తే చక్కని ఫలితం వస్తుంది.

సీరియల్

# వెన్నెల పరుగులు

యర్రం చంద్రశేఖరం

**జరిగిన కథ**

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకి ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుండి తనే పెంచి పెద్ద చేస్తాడు. లక్ష్మయ్య గారికి గుండె జబ్బు వస్తుంది. ఆయనకు శ్రమ యివ్వకుండా వుండటానికి రామం చదువు హెచ్. ఎస్, సి. తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. అతను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది. శారద విషాదగాథ శాంతను కదిలించి వేస్తుంది. శాంత బలవంతం మీద శారద కూడా ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరుతుంది.

## 4

శాంత శారదలు ఎక్స్‌కర్షన్ పార్టీతో వెళ్ళారు. ప్రస్తుతం వారిపార్టీ ఆగ్రాలో ఉంది. సాయంత్రం నాలుగు గంటలకు తాజ్‌మహల్ చూడడానికి వెళ్ళారు. శాంత, శారదలు. ప్రత్యేకంగా ఒక గైడును మాట్లాడుకున్నారు. మిగతా వారంతా ముందుకు వెళ్ళిన తర్వాత వీరిద్దరూ బయలుదేరారు. ఆ గైడ హిందీలో ప్రారంభించాడు. శారదకు హిందీ సరిగా రాదు. కొద్దిగామాత్రమే తెలుస్తుంది. ఆ కారణంగా ఆ గైడును యింగ్లీషులో చెప్పవలసిందిగా కోరారు. అతను ప్రారంభించాడు.

తాజ్‌మహల్ ప్రవేశద్వారంపై యిరువది మూడు చిన్న చిన్న బురుజులున్నాయి. ఆ తాజ్‌మహల్ నిర్మాణానికి ఇరువది మూడుసంవత్సరాలు పట్టాయట! ఇరువది మూడుకోట్లు ఖర్చయ్యాయట! దాని నిర్మాణసమయంలో – యిరువది – ముగ్గురు మరణించారట...! ఈ మూడురకాలసంఖ్యలు ఒకటిగా ఉండడంవల్ల ఆద్వారంపై వాటి చిహ్నాలుగా యిరువది మూడు బురుజాలు నిర్మింపజేశాడట ఆ మొఘలు పాదుషా షాజహాను. ఈ విషయాన్ని చెప్పి లోపలికి త్రోవతీశాడు గైడు. అతనిని అనుసరించారు శాంత, శారదలు. తాజ్‌మహల్ చుట్టూ ఉన్న తోట చూసిన శారద ఎంతో ఆశ్చర్యపోయింది. కొన్ని ఎకరాల వైశాల్యంలో చక్కగా కత్తిరించబడిన చెట్లతో ఎంతో ఆకర్షణీయంగా ఉంది ఆ తోట. ఆ విశాలమైన తోటను చూస్తూ నడుస్తున్నారు. తాజ్‌మహల్ ఎదురుగా పొడుగైనహౌజు ఉండి దానిలో ఫౌంటెన్లు అమర్చబడి యున్నాయి. అందులోనుండి చిమ్మబడుతూన్న నీరు, సూర్యకిరణాలు ఆ నీటినుండి చొచ్చుకు పోవడంవల్ల ఏర్పడుతూన్న చిన్నసైజు యింద్రధనుస్సులు ముచ్చటగా ఉండి ఎంతో అందంగా కనుపిస్తున్నాయి. ఆ తాజ్‌మహల్ ముందు ఉన్న ఒక తెలుచదరపు నీటిహౌజులో పూర్తి తాజ్‌మహలు ప్రతిబింబిస్తూ ఉంది. అంత చిన్నహౌజులో ఎంతో పెద్దగా, ఎత్తుగా ఉన్న తాజ్ మహలు ప్రతిబింబం పూర్తిగా కనుపించడం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది వారికి. అప్పటివారి విజ్ఞానము, శాస్త్రము ఎంత అభివృద్ధిలో ఉండేవో తెలుసుకోవడానికి నిదర్శనం దృశ్యము. ఆ వింత దృశ్యాలు చూస్తూ తాజ్‌మహల్ ముందుకు వెళ్ళారు. మెడఎత్తి చూస్తేగాని దాని శిఖరం కనుపించలేదు వారికి. పూర్వము తలపాగాలు ధరించి వెళ్ళేవారట! వారు ఆ శిఖరాన్ని చూడడంతో ఆ తలపాగాలు క్రిందపడిపోయేవట! అంత ఎత్తయిన కట్టడమది.

దూరంనుండి చూస్తే తెల్లగా, హిమ శిఖరంలా ధగధగలాడుతూ కనుపించే ఆ ప్రేమచందపత్రం గోరీదగ్గరకు వెళ్ళుతున్న కొద్దీ వింతకాంతులీనుతూ చిత్రవిచిత్రమైన రంగులు కనుపించడం ఆశ్చర్యకరమైన విషయం. చాలాదగ్గరకు వెళ్ళి చూసి వారు ఆశ్చర్యపోయారు ఒక్కొక్క పువ్వులో రకరకాలైన రంగురాళ్ళు పొదిగారు. గులాబీపువ్వులు, లతలు; ఎంతో మనోహరంగా ఉన్నాయి, మన స్వర్ణకారులు తమ కళాకౌశలంతో నెక్లెసులలో రాళ్ళనెలా పొదుగుతారో అలాగే ఆనాటి శిల్పులు తమ అత్యద్భుత ప్రావీణ్యంతో రంగురాళ్ళను పొదిగారు. కనీసం వాటిని అతికించినట్లుకూడా కనుపించనంత నేర్పును ప్రదర్శించారు. ఆ శిల్పచాతుర్యాన్ని ఉత్సాహం తిలకిస్తూ లోపలికి వెళ్ళారు. వెనుకభాగంలో ఉన్న గదులో ఒకచోట సున్నం ఊడిపోయి యిటుకలు బయటపడ్డాయి. శాంత శారదలకు వివరాలన్నీ పూసగుచ్చినట్లు చెబుతూన్న ఆ గైడు న చేతిలోఉన్న యినుపముక్కతో ఆ యిటుకలనుకొట్టాడు. ఇనుము యినుముతో కొట్టినపుడు వచ్చే శబ్దంలా వచ్చింది. ఇద్దరూ విస్తుపోయారు. అంత గట్టితనం యిటుకలలో ఉండబట్టే కొన్నివందలఏండ్లు గడచినా ఆ కట్టడము చెక్కుచెదరకుండా ఉంది.

ఆనాటి శిల్పకారుల కళానైపుణ్యానికి ముగ్ధులౌతూ తదేక ధ్యానంతో వాటిని పరిశీలించసాగారు.

ఈ రోజులలోని కట్టడాలు, ఒక

వర్షాకాలంలో తడుస్తే మరొక వర్షాకాలాన్ని చూడలేవు' అంది శారద.

ఆ మాట విన్న శాంత తనకు ఈ మధ్య పత్రికలో చదివిన ఒక సంఘటన స్ఫురణకు రాగా 'అవునే శారూ...! ఈమధ్య ఒక కంట్రాక్టరు ఫారెస్టు ఏరియాలో ఒక ట్రావెలర్సు బంగళా కట్టాడట! దాని ప్రారంభోత్సవం ఒక మంత్రిగారు చేయాలి. ఆయనకు తీరిక చిక్కి ప్రారంభోత్సవం చేయడానికి వచ్చేసరికి వర్షాకాలం గడిచిపోయి శీతాకాలం వచ్చింది. ఆ సంవత్సరం వర్షాలు ఎక్కువగా కురిశాయి. మంత్రిగారితో అతని సిబ్బంది, బలగమూ అంతా ప్రారంభోత్సవానికి వెళ్ళారు. ఆ ట్రావెలర్సు బంగళా ఉండవలసిన స్థలంలో శిథిలాలు కనిపించాయట! విచారణ జరుపగా వర్షాకాలంలో పడిన వర్షాలకు ఆ యిల్లు కూలిపోయిందని తేలిందట ! కంట్రాక్టరు బిల్లు ప్యాసుచేయించుకొని మూడు మాసాలైందట! ప్రారంభోత్సవానికి వెళ్ళిన మంత్రిగారు ఆ శిథిలాలను చూసి ఆశ్చర్యంతో తికమకపడి తిరుగుముఖం పట్టారట! ఆ తర్వాత ఆ విషయాలను కూలంకషంగా చర్చించి విచారణ జరపడానికి ఒక కమిటీని నిర్ణయించిందట ప్రభుత్వం!' అంది శాంత. ఇద్దరూ నవ్వుకున్నారు, ఒకరి ముఖంలోకి మరొకరు చూస్తూ—

స్వార్థం, మోసం, అన్యాయం, అనీతి తాండవంచేస్తున్న ఈ రోజులకు, నిస్వార్థంగా తమ పని అని చేసుకుపోయిన ఆ రోజులకు గల తారతమ్యాన్ని నిరూపించడానికి పై రెండు ఉదాహరణలు చాలు. కొన్ని వందలయేండ్లు గడిచినా చెక్కుచెదరని అప్పటి ఈ కట్టడమెక్కడ? వసంతఋతువులో కట్టినవి శిశిరఋతువులో నామరూపాలు లేకుండా పోతున్న యిప్పటి ఈ కట్టడాలెక్కడ ? దీనికి కారణమేమిటి? శాస్త్రం అభివృద్ధి చెందకనా ? అప్పుడున్న నిపుణులు యిప్పుడు లేకనా ? ఈ రెండూ కావు. మనుష్యులలో దినదినం క్షీణించిపోతున్న నైతికవిలువలే యిటువంటి అనర్థాలకు మూలకారణం.

శాంత శారద ఇద్దరూ గైడును అనుసరిస్తూ అసలు గోరీలున్న క్రింది భాగం లోపలికి వచ్చారు. పై భాగంలో కన్న క్రింది భాగంలో వున్న పనితనం, నగిషీలు ఎంతో అద్భుతంగా ఉన్నాయి. అరబ్బీ, పారసీక భాషలలో ఖురాను నందలి పవిత్రవాక్యాలను మలచిన రాళ్ళను పొదిగారు. గోరీలపై గల లతలు, పూలు కూడా ఎంతో బాగున్నాయి. అవన్నీ వివరంగా చూసి బయటికి వచ్చారు. మిగతా స్నేహితులంతా వార్డెనువెంట బస్సు నిలబడి ఉన్నవైపు నడుస్తున్నారు. గైడుకు డబ్బులిచ్చి వారికి పది, పదిహేను గజాల వెనుకగా అనుసరించసాగారు.

'శాంతా...! నాకు తాజ్ అందం వెన్నెలరాత్రి చూడాలని ఉంది. నేను కలలో కూడా ఊహించని ఈ ప్రయాణం నీ వల్ల సాధ్యపడింది. ఈ కోరిక కూడా నీవల్లే తీరాలి. వాళ్ళంతా వెడితే వెళ్ళారు. మనం ఏ టాక్సీలోనో వెడదాం! నీవెలాగైనా వార్డెన్‌కు చెప్పి ఒప్పించాలి' తన అభిలాషను వెల్లడించింది శారద.

'అలాగే...! అడిగి ఒప్పిస్తాను' అని త్వరత్వరగా నడిచి వార్డెనును కలుసుకొని, ఆమెతో మాట్లాడి, తిరిగివచ్చి శారదను కలుసుకుంది.

'వార్డెను వద్దందే...!' అంది శాంత.

శాంతమాట విన్న శారదముఖం చిన్నబోయింది—



'పోనీలే—! అనవసరంగా నిన్ను శ్రమపెట్టాను.' విచారంతో అంది శారద.

శారద ముఖంలోని ఆ దైన్యాన్ని చూసిన శాంత 'లేదు లేదే...ఒప్పుకుంది కాని జాగ్రత్తగా రమ్మని ఒకటికి రెండుసార్లు హెచ్చరించింది. 'సరే...!' పద వచ్చేశాను.' అని మునిపళ్ళతో క్రింది

నవ్వును ఆపుకుంది.

'అమ్మ దొంగా...! నన్ను ఉడికించా లని పన్నిన పన్నాగమా...?' అని చిరు నవ్వు చిందిస్తూ, శాంత బుగ్గపై ఒక చిన్నదెబ్బ వేసింది శారద.

ఇద్దరూ తనివితీరా నవ్వుకున్నారు —

* * *

ఆ నాటి కొలువు చాలించిన సూర్యుడు తన దినచర్య ముగించుకొని గంటపైగా గడిచింది. ఆరోజు పౌర్ణమి. పగలంతా తీక్ష్ణ సూర్యరశ్మికి తపిస్తూన్న ప్రాణు లకు తమ హేమజ్యోత్స్నలను ప్రసాదించే నిమిత్తం, చనుబాలకోసం తల్లిపై కెగ బ్రాకుతూన్న పసిపాపలా క్రమంగా చంద్రుడు ఆకసానికి ఎగబ్రాకు తున్నాడు. అలా ఎగబ్రాకుతూ మధ్య మధ్య మేఘా లతో దోబూచు లాడుకుంటున్నాడు. అది వసంతఋతువు. చల్లగాలి వీస్తూ ప్రాణు లకు హాయిని కలిగిస్తూ ఉంది. తాజ్ మహల్ ప్రక్కగా ప్రవహిస్తూన్న యమునా నది పైనుండి వీస్తూన్న పిల్ల తెమ్మె రలు ఆ యిద్దరు యువతులకు ఎంతో హాయిని, ఉత్సాహాన్ని కలిగిస్తూ ఉంది.

'శాంతీ...!' అని నాలిక కరుచుకొని ఏదో చెప్పబోయి ఊరుకుంది శారద.

'ఏమిటే శారూ? మధ్యలో ఆపేశావ్?'

'ఏమీలేదు అనుకోకుండా నా నోటి నుండి 'శాంతీ' అనే పదంవచ్చింది అలా పిలుస్తే నీకేమైనా బాధ కలుగుతుం దేమోనని భయపడ్డాను' అంది శారద.

'ఎందుకే భయం ...? అలా పిలుస్తే నీవు నాకు మరీ సన్నిహితురాల వైన ట్లుగా భావించుకుంటాను' మెరుస్తూన్న కళ్ళను త్రిప్పుతూ అంది శాంత.

'ఎంత మంచిదానవే శాంతీ! నీచల్లని నీడలో నా శేషజీవితాన్ని విశ్రాంతిగా గడు పుతాను.' ఆప్యాయతను వ్యక్తంచేస్తూ అంది శారద.

'నీ కేమైనా పిచ్చెక్కలేదు కద...? నా చల్లని నీడలో జీవితాంతం నీవు గడ పడ మేమిటి? నే నేమైనా మగవా ణ్ణిటే ...? జీవితాంతం నిన్ను భరించ డానికి? అందుకు ఎవరో ఒకరు పుట్టి ఉండే ఉంటారు. ఒకవేళ నేను మగవా ణ్ణైనట్లైతే నిన్ను ఒదలకపోయేదాన్ని'

## పౌర్ణమి

చిలిపిగా శారద కళ్ళల్లోకి చూస్తూ, ఆమె బుగ్గగిల్లి, లేచి పరుగెత్తింది శాంత. ఆమె ననుసరించి పదినిముషాలలో పట్టుకుంది శారద. ఇద్దరూ రొప్పుతూ, రొజుతూ అక్కడ ఉన్న పచ్చికబయలుపై కూలబడ్డారు.

'నీ కెంతపొగరే శాంతీ...? ఉండు. మా అన్నయ్యతో చెప్పి భరతం పట్టిస్తాను. నీవు మగవాడవౌతావూ...? నా వెంట పడతావూ...?'

'చెప్పుకోలే...!నా కేమన్నా భయమా...?'

'ఏం...? భయంలేకుండా అంత గారా బంగా చూస్తాడా మా అన్నయ్య...?'

'అవును... గారాబంగానే చూస్తాడు. నీకు అసూయ కలుగుతూ ఉందా...?

'ఎంత మాటన్నావే శాంతీ? ఈసారి అంటే అన్నావు కాని మరోసారి అంటే సహించలేను నీవు నీ బావను పెళ్ళాడి కలకాలం పసుపుకుంకుమలతో కళకళ లాడుతూ కనుపించాలి. జీవితంలో నాకిక మిగిలి ఉన్న కోరిక యిదొక్కటే...!' కళ్ళల్లో నీరు నింపుకొని, దీనంగా ముఖం మార్చుకొని శాంతను చూస్తూ అంది శారద.

'ఏమిటే యిది...? పరిహాసానికి అంటే కంట తడిపెడుతున్నావా...? మాట జారి పోయింది. నీమనసు నాకు తెలియదటే...! అయినా ఆరోజుచేసిన ప్రమాణాన్ని తప్పు తాననుకున్నావా? అలా ఎప్పటికీ జరగదు. నీ వివాహం జరిగినతర్వాతే నా వివాహం. ఈ విషయం బావతో కూడా నొక్కి చెబుతాను.'

'వద్దు శాంతా...! నన్నెవరని వివాహ మాడతారు...? కులగోత్రాలు తెలియని దాన్ని.'

'అలా అనోకు. బావ తలచుకుంటే అసాధ్యమేదీ ఉండదు. నాకు తెలుసు నీ హృదయం ప్రభాకరానికి అంకితమైంది. అదైనా అంత సాధ్యంకాని పనేమీ కాదు. కాని...శారూ! ఆ మూర్ఖుడిని చేసుకొని ఏం సుఖపడతావు?' ప్రభాకరం ప్రసక్తి రావడంతో శారద బుగ్గలు ఎరుపెక్కాయి. శారద ప్రభాకరంపైన మమతను పెంచు కున్నదని ఏనాడో అర్థం చేసుకుంది



'అతను మూర్ఖుడుకాదు శాంతీ! అతని చుట్టూచేరి అతనిని నాశనంచేయాలా అని చూస్తున్నారు కొందరు స్వార్థ పరులు. ఆ విషజాలంనుండి ఎలా బయట పడతాడో ఏమో? అతను సానపెట్టని వజ్రంలాంటివాడు. సానపెడితే వజ్రం మెరిసే విధంగా అతనిని సక్రమమార్గంలో పెట్టగలిగినవారుంటే రాణిస్తాడు. అదెవ రికి సాధ్యం...? ఏదేలా ఉన్న ప్రభాక రాన్ని నా ప్రక్కన ఊహించుకొనేంత మూర్ఖురాలనుకాను. నీవద్ద నాకు దాపరి కమేముంది? ప్రభాకరాన్ని ప్రేమిస్తూన్న మాట వాస్తవమే! కాని ఆ ప్రేమ ఈ జన్మలో ఫలించదు. అంతస్తులు, కుల గోత్రాలు అడ్డువస్తాయి. అంతేకాకుండా నా పుట్టుపూర్వోత్తరాలు నాకే తెలి యవు. అటువంటి ప్రమాణం చేయవద్దని నీకు యిదివరకే చెప్పేను. నా జీవితం ఎండుటాకువంటిది. గట్టిగాగాలివీస్తే ఎటు కొట్టుకుపోతుందో ఎవరికి తెలియదు.'

'శారూ...! మనం మానవులం మాన వులకు అసాధ్యమేదీ లేదంటారు! మన ప్రయత్న లోపంలేకుండా చూద్దాం! ప్రభా కరమేమిటి? డబ్బు కుమ్మరిస్తే కొండ మీది కోతైనా దిగివస్తుంది.'

'ఏహే ... శాంతీ... ! మీరు డబ్బు మాత్రం కుమ్మరించగలరు. కాని నాకు లేని అర్హతల నెక్కడినుండి తేగల గు తారు? సరే...! ఈ విషయాలు మళ్ళీ ఎప్పుడైనా మాట్లాడుకోవచ్చు. మనం యిక్కడ ఎందుకు ఆగి ఉన్నామో, ఆ విషయమే మరిచిపోయి కబుర్లలో పడ్డాం. ధవళ కాంతులను పట్టు తివాచీలా తమచుట్టూ నలుప్రక్కలా అవరించిన వెన్నెలను చూస్తూ అంది శారద.

'కలిసొచ్చే కాలంవస్తే నడిచొచ్చే కొడుకు పుడతాడట! అన్నీ శుభంగా జరగాలని ఆశిద్దాం... ! మంచిది. ఇక వెడదాం పద. ముంతాజ్, షాజహానుల ప్రేమచిహ్నాన్ని ఈ వెన్నెలలో చూద్దాం.'

ఇద్దరూలేచి తాజ్ మహల్ వైపు నడి చారు. ఆ పండువెన్నెలలో ఆ పాలరాయి కట్టడం వింతకాంతులీనుతూ యెంతో అందంగా ఉంది.

'శారూ...! ఆ మొఘలు చక్రవరి

# మల్లెలు...

ఎంత రసహృదయుడై ఉండాలి? తన ప్రియురాలి అంతిమకోరికను తీర్చడానికి ఎంత ధన వ్యయం చేశాడు? ప్రపంచంలో గల ఏడువింతలలో ఒకటిగా పరిగణించ బడుతూన్న తాజ్‌మహలు మనదేశంలో ఉండడం మనకు ఎంత గర్వకారణం? అయినా ఒక సమాధికోసం అన్నికోట్ల రూపాయలు వ్యయపరచడం వృధా అనినా ఉద్దేశ్యం. అదే డబ్బు ప్రజోపయోగ కార్యాలకు వినియోగపరచినట్లయితే ఎంతో బాగుండేది.'

'నీవంటున్నమాట వాస్తవమైనదే! కాని లలితకళ, శిల్పకళ, యివన్నీ మరుగున పడిపోవలసిందేనా...? ప్రజోపయోగ కార్యాలతోపాటు యివి కూడా ముఖ్యమే!'

'అబ్బ...! ఈ తాజ్‌మహల్‌ను వదిలి వెళ్ళ బుద్ధివేయడంలేదు. ఇక్కడే ఉండా లనిపిస్తూ ఉంది.

'పిచ్చి శాంతీ! మొదటిసారి చూశావు కాబట్టి నీకలా అనిపిస్తూ ఉంది. అదెలా సాధ్యమే! ఇక్కడే ఉండిపోతే నాలుగు రోజులలో అన్నయ్య నిన్ను వెదుక్కుంటూ వస్తాడు. అంతపనిమాత్రం చేయకు' నవ్వుతూ అంది శారద.

'విదేశస్థులు కూడా దీన్ని ఎంతో పొగిడారు. ఎవరైనా శాశ్వతకీర్తి సంపాదించుకోవాలంటే యిలాంటి అద్భుత కట్టడాలను నిర్మించడ మొక్కటే మార్గము. తాజ్‌మహల్ పుడమిపై సురక్షితంగా ఉన్నంతకాలం షాజహాన్, ముంతాజ్‌లు అమరులై ఉంటారు. వారి పవిత్రప్రేమ ఆచంద్రతారార్కం ఈ కట్టడం ద్వారా భావితరం వారికి సందేశాన్నిస్తుంది.'

'అవును!'

తృప్తితీరా మళ్ళీ తోట, తాజ్‌మహల్ కట్టడమూ, అన్నీ తిరిగి చూశారు. ఆ తర్వాత వారు బసచేసిన సత్రానికి వెళ్ళిపోయారు.

మరురోజు అంతా ఆగ్రాకోట చూడడానికి వెళ్ళారు. అక్కడడున్న వింతలలో ఒకటిమాత్రం జాగ్రత్తగా గమనించదగినది. అక్కడికి మూడుమైళ్ళ దూరంలో ఉన్నటువంటి తాజ్' మధ్యలో ఎన్నో అవరోధాలు ఉన్నప్పటికీ ఒకచోట అమర్చబడి ఉన్న కుంకుమబొట్టంత అద్దంలో దాన్ని చూసి వారు ఎంతో ఆశ్చర్యపడ్డారు. అంత చిన్న అద్దంముక్కలో ఎంతో పెద్దదైన తాజ్ మహల్ యొక్క ప్రతిబింబం కనుపించే విధంగా అమర్చిన ఆ శిల్పకారుల గొప్పతనం శ్లాఘనీయమైనదని తలపోశారు.

ఆ విధంగా ఆగ్రాలో చూడవలసిన వన్నీ చూసి ఢిల్లీ వెళ్ళారు. ఢిల్లీలో కుతుబ్ మీనార్, ఎర్రకోట, జంతర్ మంతర్, పార్లమెంటు భవనం, రాష్ట్రపతిభవనం, తదితర చూడవలసిన ముఖ్య స్థలాలన్నీ చూసి హైదరాబాదు తిరిగివచ్చారు. ఈ ఎక్స్‌కర్షన్ కారణంగా శాంత, శారదలు మునుపటికన్న సన్నిహితులైనారు.

* * *

పిక్నిక్‌కు వెళ్ళివచ్చినరోజు రాత్రి ప్రభాకరం భోజనం చేయలేదు. మొదట శ్రీపతిగారు ఆ తర్వాత అన్నపూర్ణమ్మగారు వెళ్ళి అతనిని భోజనానికి పిలిచి వచ్చారు. తమ త్రాగిన విషయం ఎక్కడ బయటపడుతుందోనని భయపడ్డాడు ప్రభాకరం. అతను ఎంత జాగ్రత్తపడినా శ్రీపతిగారు ఆ విషయాన్ని పసిగట్టారు. బాధపడ్డారు. తనలోనే దాచుకున్నారు. ఈ విషయం భార్యకు తెలుస్తే కుమిలి, కుమిలి ఏడుస్తుందని వారికి తెలుసు. విచారంతో ఆలోచనలో పడ్డారు. 'ఏమిటిది? వీడి ప్రవర్తన రోజు రోజుకు శ్రుతిమించి రాగాన పడుతూఉంది. లేండముదిరి ఊసరవెల్లిగా మారినట్లు నేనేం చేయాలి...? నామాట బొత్తిగా వినడం లేదు. చదువు ఆపుచేయించి వివాహంచేస్తే దారికిరావచ్చు. వీడి వ్యవహారం యిప్పటికే చాలామందికి తెలిసింది. చూస్తూ చూస్తూ ఏ తలిదండ్రులు తమ పిల్లనిస్తారు? ఏ అమ్మాయి వీడిని చేసుకుంటుంది. చదువు ఆపమంటే ఆపుతాడో లేదో? అంతా నా ఖర్మ...! నాతోటి వ్యాపారస్థుల పిల్లలు ఈ పాటికి చదువులు పూర్తిచేసి ఎవరి వ్యవహారాలు వారు చూసుకుంటున్నారు. అందరికీ ఆ అదృష్టం ఉండొద్దా...? ఇంతగా నేను ఏ జన్మలో చేసుకున్న పాపమో నన్ను ఈ జన్మలో పట్టి బాధిస్తూఉంది. శారద! ఆ అమ్మాయికి నిలువ నీడలేదు. చదువుల సరస్వతి. ఆ అమ్మాయి అలా దొంగతనం చేసిం

దంటే వస్తు కళ్ళంకాకుండా ఉంది. బహుశా యిది ప్రభాకరం పన్నాగమే అయిఉంటుంది. ఏమో ...? ఆ అమ్మాయే చేసిందో ఏమో...?కనీసం ఒక్కసారైనా తాను నిర్దోషినని చెప్పుకోలేదు. పైగా తెల్లవారేసరికీ మాయమైంది. ఏమని నిర్ణయించుకోను? తను ఏ నేరమూ చేయకపోతే అలా వెళ్ళిపోవలసిన అవసరమేముంది? ఇక్కడే ఉండి తను నిర్దోషి అని నిరూపించుకోవచ్చు గద! ఒకవేళ ఆ అమ్మాయి నిర్దోషిఅవుతే దోషిఎవరు? ప్రభాకరమా...? అదెలా సాధ్యం? ప్రభాకరం యిటువంటి నీచమైనపని చేస్తాడా. వాడిని చిన్నప్పటినుండీ చూస్తున్నాను. ఎంత దుడుకువాడైనా దొంగబుద్ధి మాత్రం లేదు. నిస్సందేహంగా ఆ అమ్మాయే చేసి ఉంటుంది. దొంగతనం బయటపడేసరికి ముఖంచెల్లక యింట్లో నుండి వెళ్ళిపోయింది. ఏమిటో ...? రామా కృష్ణా అంటూ కాలం వెళ్ళబుచ్చవలసిన ఈ రోజులలో నాకు ప్రభాకరం ఒక సమస్యగా తయారయ్యాడు. వాడు ఎలా బాగుపడతాడో ఏమో?

అన్నపూర్ణమ్మగారు తమ వంటింటి పనులు పూర్తిచేసుకొని హాలులోకివచ్చారు. ఆ అలికిడికి శ్రీపతిగారు ఆలోచనలనుండి తేరుకొని బాహ్య ప్రపంచంలో పడ్డారు. శారద వెళ్ళిపోయినప్పటినుండి అన్నపూర్ణమ్మగారికి పనిలో వెసులుబాటు కావడంలేదు. పైగా ప్రభాకరం అలా ప్రవర్తిస్తున్నాడని శ్రీపతిగారికన్న అన్నపూర్ణమ్మగారే ఎక్కువ కుమిలిపోతున్నారు.

'ఏమండీ...! ఇలా అవుతే ఎలా? వాడు ప్రొద్దున్నగా వెళ్ళాడు, ఇప్పుడు తిరిగి వచ్చాడు. అక్కడ ఏం తిన్నాడో? వచ్చిన వాడు భోంచేసి పడుకుంటే నాకు బాధ ఉండేదికాదు!' ఆ కన్నతల్లి ప్రాణం తల్లడిల్లింది.

'చూడు...మనవాడినికన్నాంగాని వాడి రాతను కనలేదు గదా! భారమంతా ఆ భగవంతుడిమీదవేసి వాడికి మార్పు ఎప్పుడువస్తుందా అని ఎదురుచూడడం తప్ప మనం చేయదలిగేదేముంది?'

'ఏమోనండీ...వాడు కుదురుగా ఉండి, కోడలితో యిల్లు కళకళలాడే అదృష్టాన్ని నా కొనప్రాణాలతోనైనా చూస్తానో లేదో? అనుమానంగా ఉంది' అని కంట తడి పెట్టారు అన్నపూర్ణమ్మగారు. శ్రీ

వెళ్ళి మద్దెలతో మొరపెట్టుకున్నట్టు శ్రీపతిగారు తను బాధను బయటపెట్టకుండా అన్నపూర్ణమ్మగారిని సోదార్చలేక నిలువునా కృంగిపోయారు వీరిద్దరి మనస్తా

గదిలో ఒళ్ళు మరచి నిద్రపోతున్నాడు.

* * *

ఉదయం పెందలకడనే లేచి స్నానం

పూజ ముగించారు శ్రీపతిగారు. హాల్లో కూర్చొని ఆనాటి పేపరు చూస్తున్నారు. ఇంతలో గుమ్మంలో ఏదో అలికిడై పేపరు చూస్తున్నవారల్లా తమ దృష్టిని అటు మళ్ళించారు. ఆ వచ్చినవారిని చూసి, సంతోషంతో లేచి, లోపలికి ఆహ్వానించారు. ఆ వచ్చినది సుందరరామయ్యగారు, ఆయన కూతురు. కూతురిని ఇదే మొదటి సారిగా తీసుకువచ్చాడు. వారు అన్నపూర్ణమ్మగారి అన్న. ఆయనకు ఒక్కతే కూతురు, కూతురికి ఐదవ ఏడు నడుస్తూ ఉండగా వారి భార్య అకస్మాత్తుగా హృద్రోగంవల్ల మరణించింది. ఆమె హఠాత్తుగా మరణించడంతో సుందర రామయ్యగారు ఎంతగానో కృంగిపోయాడు. ఎంతో మానసిక వ్యథ ననుభవించారు. ఎంత మంది ఎన్నివిధాల నచ్చజెప్పినా ద్వితీయానికి మాత్రం ఒప్పుకోలేదు.

సుందరరామయ్యగారి కుమార్తె పేరు నీరజ. తండ్రి కూతురు యిద్దరూ కాల కృత్యాలు తీర్చుకున్నారు. అన్నపూర్ణమ్మ గారు అందరినీ ఫలహారాలకు పిలిచారు. అకస్మాత్తుగా ప్రభాకరం యింకా నిద్ర లేవలేదన్న విషయం గుర్తుకు వచ్చింది అన్నపూర్ణమ్మగారికి. పైకి వెళ్ళి, చూసింది ఆమె. గుర్రుపెట్టి నిద్ర పోతూనే ఉన్నాడు. ఆ నిద్రలో పలవరిస్తున్నాడు. 'రోజా...! రోజా...! ఇలా దగ్గరగారా...! ఇంకా దగ్గరగారా...! హాయిగా గడుపుదాం. ఈ ఆనందం ఎల్లకాలం ఉండాలి' అని. అన్నపూర్ణమ్మ గారు ఆశ్చర్యపోయారు. 'ఎవరీ రోజా? ఆ అమ్మాయికి వీడికి ఏమిటి సంబంధం? తొమ్మిది కావస్తున్నా వీడు నిద్ర లేవలేదేమిటి?' అని ఆలోచిస్తూ నుదురుతాకి చూసారు వారు. మామూలుగావే ఉన్నాడు. ఒళ్ళు ఏమాత్రం వేడిగాలేదు విసుగు పడుతూ గట్టిగా తట్టి లేపారు. ఎంతో అవస్థపడిన తర్వాతగాని లేవలేదు. 'కాఫీ... కాఫీ' పలవరిస్తున్నట్లుగా అంటూ లేచాడు ప్రభాకరం.

'ఒరేయ్! తొమ్మిదైంది. త్వరగా లేచి స్నానం చెయ్యి. మావయ్య నీరజవచ్చారు. ఫలహారాలుచేసే పైనైనా లేవకపోతే ఎలా...? మావయ్య ఏమనుకొంటాడు?'

ప్రభాకరానికి నిద్రమత్తు ఒదిలిపోయింది. గబగబ పదినిముషాలలో నిత్య కృత్యాలు తీర్చుకున్నాడు. తల దిమ్ముగా

## మల్లెలు..

ఉంది. అసలు త్రాగడమే క్రొత్త. ఎంతో బలవంతంచేసి త్రాగించింది రోజా. దాంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.

అంతా ఫలహారాలకు కూర్చున్నారు. కులాసా కబుర్లతో ఫలహారాలు పూర్తి చేశారు. తనకు నిద్రవస్తున్నదనిచెప్పి పైకివెళ్ళి మళ్ళీ పడుకున్నాడు ప్రభాకరం. అసలు విషయం ఒక్క శ్రీపతి గారికి మాత్రమే తెలుసు.

'బావగారూ...! అబ్బాయి నలిగినట్లు కనుపిస్తున్నాడేం?'

'అబ్బే...! ఏంలేదు. నిన్న స్నేహితులంతా కలిసి పిక్నిక్‌కు వెళ్ళారు. బాగా అలసిపోయినట్లున్నాడు. రాత్రి పొద్దుపోయి వచ్చాడు. అందువల్ల నిద్ర ఆపుకోలేకపోతున్నాడు.'

'అలాగా...!'

'సరేగాని బావా...! ఈ మధ్య బొత్తిగా ఉత్తరాలు వ్రాయడం లేదేమిటోయ్! అంత తీరికలేని పనులుంటున్నాయా...? కనీసం నీవు వస్తున్నట్లయినా ఉత్తరం ముక్క వ్రాయలేదు.'

'నా ఆరోగ్యం సరిగా ఉండడంలేదు. పైగా రెండు మూడు సంవత్సరాలనుండి ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. విపరీతంగా దగ్గు, తెమడ, ఆయాసం వస్తూ వుంది. అక్కడ డాక్టర్లకు చూపిస్తే వలుగురు నాలుగు రకాలుగా చెప్పారు. ఇక లాభంలేదని ఊహించి ఆస్తులన్నీ అమ్మి రావలసినవి వసూలు చేసుకొని, యివ్వవలసినవి యిచ్చి ఆ ఊరిలో ఋణం తీర్చుకొని వచ్చేశాను. అమ్మాయి మెడిసిన్ చదువుతానని అనడంవల్ల అమ్మాయిని ఒదిలి ఒంటరిగా ఉండడం యిష్టంలేక, ఇక్కడయితే అటు నా వైద్యము, ఇటు అమ్మాయి చదువు రెండూకొనసాగుతాయని ఊహించివచ్చాను.'

'మంచిపని చేశావ్! మీ చెల్లెలికి యింట్లో సందడిగా ఉంటుంది. సరే...! ఎలాగూ నీతోనాకు సందడే!'

'అదేమిటండీ బావగారూ...! మీ యింట్లో ఎంతకాలమని ఉంటాము?' మీకు తెలిసినంతలో ఒక చిన్న బంగళా అందంగా ఉండేది ఉంటే చూసి బేరం చెయ్యండి కొంటాను.'

'అదేమిటోయ్! నీకేమైనా పిచ్చా! చాదస్తమా! మనం అంత పరాయి వాళ్ళమా? ఇది నీ యిల్లేఅనుకో? రేపు ప్రభాకరానికి నీరజకు వివాహం జరిగితే యీ యింట్లో వేరేవాళ్ళెవరుంటారిక? నీకా ఆడదిక్కులేదు. ఎలాగూ అమ్మాయి దగ్గరే ఉండాలి. ఈ మాత్రానికే వేరే యిల్లు కావాలంటావా? బాగానే ఉంది.' అని తన భార్యను పిలిచి 'చూశావటే మీ అన్నయ్య ఏమంటున్నాడో...?' అని అన్నపూర్ణమ్మ గారికి ఈ విషయం వివరంగా చెప్పాడు.

'అదేమిటన్నయ్యా... ఇక్కడ ఉండ తలచుకున్న తర్వాత మా యింట్లో ఉండవలసిందే! నీరజకు చిన్నతనం. అది యింటిని ఎలా చక్కదిద్దుకో గలుగుతుంది? ఇదివరకంటే ఎలాగో గడిచిపోయింది, ఇదింట్నుం. ఎవరికీ వండడానికిన్ని వీలుండదు. అది కాలేజీకి వెడితే ఒంటరిగా బిక్కు బిక్కు మంటూ ఒక్కడివే యింట్లో ఉంటావా? వారైనా నీకు మేనబావ గారేకదా!'

'అది సరేనమ్మా...! ఇంతో, అంతో మీకు పెట్టవలసిన వాళ్ళం. మీయింట్లో ఉండడం ఏం బాగుంటుందని అనుమానిస్తున్నాను.'

'హాస్...! నీ అనుమానం చట్టుబండలుగాను. ఇంతకూ విషయం యిదా? సరేలే! రేపు కట్నంలో యివన్నీ లెక్కలు చూసి యిద్దువుగాని మారు మాట్లాడకుండా యిక్కడే ఉండిపో. ఒకరికి ఒకరం అండగా ఉంటాం. పైగా రేపు పెళ్ళి కావలసిన వారిద్దరూ ఒకరిని మరొకరు అర్థం చేసుకోవడానికి అవకాశం ఉంటుంది.' నవ్వుతూ అన్నారు శ్రీపతి గారు. అందరూ వారి నవ్వుతో శ్రుతి కలిపారు. నీరజ తన విషయం ప్రస్తావనకు రావడంతో సిగ్గుతో తలవంచుకుంది.

'సరే...! ఆలోచించుకొని చెబుతాను. ప్రభాకరంలో ఏమైనా మార్పువచ్చిందా?'

'ఏమో అన్నయ్యా...! బాగానే ఉంటున్నాడు.'

'అవన్నీ తర్వాత మాట్లాడుకుందాం. మీరు విశ్రాంతి తీసుకోండి' అన్నారు శ్రీపతిగారు.

ఆ తర్వాత శ్రీపతిగారు పనిమీద తమ కారులో వెళ్ళిపోయారు. అన్నపూర్ణమ్మ గారు వంట ఏర్పాట్లు చేయడానికి వెళ్ళారు. (ఇంకా ఉంది)

[illegible] తీక్షణంగా చూశారా— మీ వారికేసి, మీ అబ్బాయికేసి మీ జీవితంలో అతి ముఖ్యమైన మగవానికేసి వో సారి దుర్బిణీలోంచిలాగా చూడండి—అతగాడు మారుతున్నాడు మహాప్రభో— మారుతున్నాడు: బహుశా చిన్న చిన్న విషయాల్లో ఈ మార్పు మీరూ గమనించే ఉంటారు. మంచి బట్టలంటే మోజుచూపడం, మంచి సువాసనలు వెదజిమ్మాలని తాపత్రయపడ్డం (ఇంటి ఆడదానికంటే మగాడే పొదర్లు గట్రా ఎక్కువ వాడాలని తాపత్రయం !) అయినదానిపట్ల ఇంకొంచెం ప్రేమ ప్రదర్శించడం...కాని అతి ముఖ్యమైన విషయాల్లో అతగాడిలో వచ్చిన వస్తూన్న మార్పులు మీరు గమనించారా? ...పెళ్ళి, బాధ్యతలపట్ల అతగాడి దృక్పథం సడలింది; తనతోపాటు సమానంగా ఆనాఫీసులోనో ఫాక్టరీలోనో సంపాదిస్తూన్న ఆడవారంటే ఆందోళ పెరిగింది —ఈ ఆడాళ్ళేమిటి అటు కార్ఖానాలో ఇటు కాఫీహోటల్లో! అటు అధికార సింహాసనంలో అటు అంతఃపురం లాంటి శయనాగారంలో — అంతటా విజృంభిస్తున్నారేమిటి? అని ఆలోచనలో పడుతున్నాడు.

ఆడవారుకూడా కొత్తచూపు సంతరించుకుని చూస్తే ఈ ఆందోళన అర్థం కాక పోదు ... పాటి ఆడవాళ్ళతో, మగవాళ్ళతో—ఎదురొచ్చిన అందరినీ ప్రశ్నించగా, గుచ్చి గుచ్చి అడగ్గా — (ఒకళ్ళనేమిటి ? డాక్టర్లని, వర్కులని, గురువుగారిని, విద్యార్థుల్ని, అమ్మాయిల్ని అబ్బాయిలని—అందర్నీ) తేలిన దేమిటంటే— ఈ కాలపు మగవాడు—మన తాతలనాటి కంటె మెరుగని. ముత్తాతల నాటికంటె




లక్షరెట్లు నయం అని. అతని పోకడలూ, అతనితో బ్రతుకూ కూడా కుతూహలంగానే ఉంటూందని —

మా ముత్తాతనాడు పురుషసింహుడంటే—ఆడదాన్ని ఉగాడ్చి పారేసేవాడని అర్థం. ఆడదాన్ని, కుక్కని, విద్దుల్ని... ఒక్కలాగే చూసేవారేమో మొగాళ్ళు! తనసాటి మగాణ్ణి కలలో కూడా అలా ట్రీట్ చేద్దామని అనుకోడు ముత్తాత!




[illegible] భార్యని ప్రేమగా చూడ్డంలోనే కాదు— క్రూరత్వం ప్రదర్శించకుండా మగవాణ్ణి అనిపించుకోగల నేర్పు సంపాదించాడు.

మగాడేమిటని మీ ఉద్దేశ్యం— అతగాడేమని అనుకుంటున్నాడో— అదే నిజమని అతగాడి ఉద్దేశ్యం! క్లిష్టపరిస్థితులలో మనస్సు కాకుండా మెదడుకి పని చెప్పి రీజనబుల్‌గా ఆలోచించి నిర్ణయాలు చేసేవాడని. నిజమేనా? కాదా? అప్పుడి మనం తేల్చుకోవాలి ...

నిజానికి నేవన్నట్టు తాతముత్తాతలనాటికన్నా ఈనాటి మగవాడు— ముందడుగు వేసినవాడే! దుస్తుల విషయంలో, అలంకరణ విషయంలో, ఆడవారిని చూసే దృష్టిలో— అన్నిటా ముందడుగు వేశాడనే చెప్పుకోవాలి. సారీవా లెక్కలు ఎవరూ కట్టడంలేదు కాని, లేకుంటే— తేలేదే—ఎన్నికోట్ల రూపాయలు ఈ పురుషులు దుస్తులకని, అలంకరణ సామగ్రికని వెచ్చిస్తున్నారో.

మానసికంగా కూడా మగవాడు కొంచెం దారుఢ్యం కలవాడే— మన ఆడవారికన్న ఆ మాత్రరనీ, ఈమాత్ర అనీ మింగడం తక్కువే. తలనొప్పిగ స్తే, యెంతసేపూ అమృతాంజనంతో సద్దుకుంటుందని నమ్ముతాడు. మనం పైకి అమృతాంజనం పూసినా లోపలి కేసేనా మాత్రలు మింగితే గాని ధైర్యంగా తగ్గుతుందని ఊరుకోలేం కదా! చిన్న విషయాల్లో ఇలా మానసికంగా బలంగా ప్రవర్తించినా — దారుణ హత్యాకాండల్లో, రోడ్డుమీద తరిమి తరిమి మనుష్యులని తన క్రయివింగుతో చంపడంలో మగవాడి ధైర్యం అమోఘం అనే చెప్పుకోవాలి. ఆలోచించినకొద్దీ— ఉత్తేజం కల్గించే ఈ మగవాడు— ఆడదాని పాలిటి కల్పతరువూ విషవృక్షీ కూడాను! ఎంత పోలిక ఎంత తేడా అని ఆశ్చర్యపోకండి. మీ పాలపడిన జీవిని మైక్రోస్కోపులో చూడండి— ●

# జలగలు

హవిస్



"అబ్బ"

పూమాల కడుతూ — మేనత్తతో కబుర్లాడుతున్న సావిత్రి ఉలిక్కిపడి తలెత్తి చూసింది. పార్థసారధి ఎడంచేతి బొటనవేలు నోట్లో పెట్టుకు చీకుతున్నాడు.

సావిత్రి పకపకనవ్వి 'సూది గుచ్చుకున్నదా బావా?' అన్నది.

పార్థసారధికి ఉక్రోషం వొచ్చింది. తమాయించుకుని, క్రిందపడేసిన లాల్చీని సూదిని దారాన్ని అందుకున్నాడు. తిరిగి చిరుగు కుట్టుకోవడంలో నిమగ్నమయ్యాడు.

సావిత్రికి అతన్ని చూస్తే జాలేసింది.

పార్థసారధి బి. ఏ. పాసైనాడు అది పాసవడానికి అతను ఎన్నితిప్పలు పడవలసి వొచ్చిందో సావిత్రికి తెలుసు. స్వశక్తి మీద తప్ప చదువుకోనని భీష్మించుకుని నానాతిగపాట్లుపడి ఆడిగ్రి కాస్తా సంపాదించుకున్నాడతను. ఆదర్శాలు ఆశయాలు అనేవాటికి కూడా ఒక హద్దు వుంటుందన్నది సావిత్రి మతం. బిఱ్ఱబిగుసుకు వుండడం తప్పే! ధర్మం ఆశించడం తప్పే! కాని, యితరులు, కేవలం తమ ఆనందంకోసం,

పూర్తి అనురాగంతో యిచ్చజూపిన సహాయాన్ని తిప్పికొట్టడం మర్యాద అనిపించుకుంటుందా?

ఆ తెలివితక్కువ తనమే ('పొగరుమోతు తనమే') లేకపోతే, పార్థసారథి ఈనాడు లాల్చీ చిరుగులు కుట్టుకుంటూ వుండవలసిన అగత్యంలేదు. అనుక్షణం అప్పుల వాళ్ళని తల్చుకుంటూ అదిరిపోతుండ నవసరంలేదు.

అతని అంతఃకరణ తెలిసిన తల్లి వర్ధనమ్మ మాత్రం అతన్ని తప్పుపట్టదు. ఆత్మగౌరవంలేకుండా బతకడంకన్నా చచ్చిపోవడం మేలు.

కుట్టు పూర్తిచేసి ఒకసారి లాల్చీని పరీక్షించాడు సారథి. అతనికి నవ్వొచ్చింది. పి. యు. సి. పరీక్ష పాసైన రోజున అతనితల్లి కుట్టియిచ్చింది ఆ లాల్చీని. అంటే, దానిసర్వీసు ఆరేళ్ళు. ఆ లాల్చీ అతను తొడుక్కున్నప్పుడు చూసిన మిత్రుడు రా జ గో పా లం అన్నాడు: 'ఆర్నెల్లలో చిరిగిపోతుంది. మీ అమ్మ కూడా యింత తెలివితక్కువపని చేసిందేమిటోయ్?' అని

ఆరేళ్ళు గడిచాయి మరి !...

కొడుకు లాల్చీ తొడుక్కోవడం చూసి వర్ధనమ్మ అన్నది: 'తొందరగావొచ్చెయ్యి మళ్ళీ సోమసుందరం గారు వొస్తాడేమో!...పైగా సావిత్రికూడా యివాళ యిక్కడ భోంచేస్తుందీ' అని.

'రేషన్ తెచ్చుకుందా?' అన్నాడు సారథి నవ్వుతూ.

'మర్చిపోయాను బావా! డబ్బు లిస్తాన్లే' అన్నది సావిత్రి కటువుగానే.

'మాహోటల్లో భోజనం ఖరీదెక్కువ సావిత్రీ! మాతిండి తింటే అజీర్ణంరాదు. దాని ఖరీదు నువ్విచ్చుకోగలవా?' అన్నాడు సారథి.

'చాల్లే వెళ్ళిరా' మందలించింది వర్ధనమ్మ.

సారథి మారు మాట్లాడకుండా చెప్పులు తొడుక్కున్నాడు సావిత్రి ముఖం విన్నం కావడం అతను గమనించక పోలేదు 'క్షమించు సావిత్రీ! మనరోడ్డు వేరు' అనుకుంటూ వీధిలోకి వొచ్చాడు.

రోడ్డుమీద నడుస్తుంటే క్రిందటి రోజు జరిగిందంతా గుర్తొచ్చింది పార్థసారథికి. సోమసుందరరావు తెల్లారకుండానే వొచ్చేసరికి గుండె గుబేలు మందతనికి. బియ్యే ఆఖరేడు చదువుతున్నప్పుడు ఆయనదగ్గర ఆరువందలు అప్పు తీశాడతను. ఆ అప్పు, వడ్డీలలో మూడొంతులు తీర్చడానికి రెండేళ్ళు పట్టిందతనికి. మిగతా రెండొందల్లో కనీసం వంద రూపాయిలైనా అర్జంట్‌గా కావాలని వొచ్చాడాయన.

వంద రూపాయలు! తన నెలజీతంలో సగానికికన్నా ఎక్కువ!

'మరోలా అనుకోకండి సారథిగారూ! ఆ డబ్బు మా తమ్ముడిది. వాడికేదో అర్జంట్ అవసరం వచ్చిందిట. పోనీ నేను సర్దుదామంటే డబ్బు పెగిలింది కాదు. మీరీ వందయిస్తే నాపరువు దక్కుతుంది.' అన్నాడాయన.

సారథికి అప్పుడు ఏం చెప్పాలో పాలుపోలేదు. నెలాఖరురోజులు.

యిప్పుడు వందరూపాయలు ఎక్కడ పుడతాయి? ఆఫీసులోకూడా అంత అడ్వాన్స్ యివ్వరు.

'చెప్పండి' అన్నాడు సోమసుందరరావు కించిత్ అసహనంగా.

'రేపటిదాకా ఆగగలరా?' అన్నాడు పార్థసారథి చటుక్కున.

'సోమసుందరరావు నవ్వాడు. ఆ నవ్వులోని వెటకారం అతని గుండెలకి సూటిగా గుచ్చుకున్నది. 'రే పు త ప్ప కుం డా యిస్తాను.' అ న్నా డు సారథి బాధని అణుచుకుంటూ.

'సరే! రేపు యివ్వకపోతే...' వాక్యం పూర్తి చెయ్యకుండానే వెళ్ళిపోయాడు సోమసుందరరావు...

ఆయన్ని తల్చుకుంటే కోపంరాలేదు సారథికి. ఆయన బాగా వున్నవాడేంకాదు. ఊరి చివరనున్న చిన్న పెంకుటింట్లో వీధిబడి నడుపుకుంటున్నాడాయన. పేదవాళ్ళంటే ప్రాణం పెడతాడాయన. ఆమధ్య తన యింటికి దగ్గర కొరికో ఏదో గొడవొస్తే, కూలీల తరఫు [illegible]డి పోలీసుకేసులో [illegible] చబడ్డాడు. దాంతో [illegible] బయటపడేసరికి ...

సారథి గబగబా అడుగులు వేయసాగాడు. అతనికి తన అవసరం తీర్చగల వ్యక్తి చటుక్కున గుర్తొచ్చాడు. ఆయన పేరు రాజారావు. 'శ్రామికబంధు' వార పత్రికకి ఆయన సంపాదకుడు, ప్రచురణ కర్త, అన్నీను. మనిషి చాలా నెమ్మదైనవాడు. కష్టపడి పత్రికను వృద్ధిలోకి తెచ్చాడు. కాని ఏం లాభం? కాకా పట్టడం, అధికారులని మంచి చేసుకోవడం తెలిసినవాడుకాదు. నిజాల్ని నిర్మొగమాటంగా రాసేసే రకం.

ఆయనకి సారథి అంటే వాత్సల్యము. తల్చుకుంటే ఆయనా అవసరం తీర్చలేక పోడు. ఆయన తల్చుకుంటాడనే విశ్వసించిన సారథి మరింత వేగంగా అడుగులు వేశాడు. మెయిన్‌రోడ్డు దాటిన తర్వాత పక్కసందులో వున్నది రాజారావు యిల్లు. మేడమీది వాటా ఆయనది. సారథి తలుపు తట్టేసరికి రాజారావ్ వొచ్చి తలుపుతీసి, అతన్నిచూసి 'హో హోహో! బహుకాల దర్శనం రండి రండి' అన్నాడు సాదరంగా.

అప్పటివరకూ ఆ ముందు గదిలో కూచునివున్న పద్దెనిమిది, యిరవయ్యేళ్ల యువతి, సారథిని చూడంగానే లేచి లోపలికి వెళ్ళిపోయింది. రాజారావు చూపిన కుర్చీలో కూచుంటూ 'చుట్టాలొచ్చారా?' అనడిగాడు సారథి.

'మా వొదిన, వాళ్లమ్మాయి వొచ్చారు' అని జవాబిచ్చి 'మంచినీళ్లు కావాలా?' అడిగాడు రాజారావు. అక్కర్లేదన్నట్టు తలవూపాడు సారథి.

'ఏమిటి వి శే షా లు? ఎలావుంది ఉద్యోగం?' కుశలప్రశ్న లేశాడు రాజారావు.

'మీకు తెలియని దేవుంది?'

'నిజమే! ... మన బతుకులు మారే రోజులు వొస్తాయా అని నిరాశ కలుగుతూ వుంటుంది సారథీ! బతుకంతా పోరాటంతోనే గడిచిపోయేలా వుంది.'

చిన్నగా నవ్వాడు సారథి.

'అన్నట్టు, డాక్టర్ మూర్తిగారు మీకు బంధువుగదూ?' అడిగాడు రాజారావు.

సారథి నవ్వుతూ 'ఏమిటి విశేషం?' అన్నాడు.

అతనికి నవ్వు రావడానికి కారణం లేకపోలేదు. డాక్టర్ మూర్తి వైద్యుడుగానే కాక, రాజకీయ నాయకుడు కూడా

[illegible] తిరిగేస్తూ రాజారావు రెండుమూడు వారాల క్రిందట తన పత్రికలో పెద్ద వ్యాసం రాశాడు. ఆ వ్యాసంలో అబద్ధాలేమీ లేవు. రాజకీయాల్లో తిరిగేవాడు డబ్బు తినక పోవడం అరుదే అయినా, అంతకుమించిన వెధవగుణాలు వుంటే, జనం అసహ్యించుకుంటారు. డాక్టర్ మూర్తి అవకాశవాది అన్నది ఊళ్లో చాలామంది చెప్పుకునేమాట.

ఆయన తన బంధువని తెలిసి రాజారావు బాధపడుతున్నాడేమో ననుకున్నాడు పార్థసారథి.

రాజారావు అతని ఆలోచనల్ని గమనించకుండా 'మీకు ఆయనదగ్గర చాగా చనువుందా ?' అని అడిగాడు.

'విరోధంలేదు' జవాబిచ్చాడు సారధి.

'ఆయన రెండోకొడుకు మీకు తెలుసా? ఎలాంటివాడు ?

సారథి ఒక్కక్షణం నెమరేసుకుని 'చాలా మంచివాడు. ఏం? ఏదైనా పెళ్లి సంబంధమా ?' అన్నాడు.

'ఔనండీ! మా అన్నయ్య కూతురికి మాట్లాడదామని'

'నిజమా?' అన్నాడు సారథి తెల్లబోయి

'ఏం ?'

సారథి తడబడి 'అబ్బే! ... అతని అన్న కింకా పెళ్లికాలేదు' అన్నాడు.

'అ తరువాత చేస్తాం? ముందు సెటిల్ చేసుకుంటే సరి' అన్నాడు రాజారావు.

సారధికి ఏమనాలో తోచ లేదు.

'కట్నం కానుకలేం అడుగుతారో? మా అన్నయ్య యిరవైవేలదాకా యివ్వగలడనుకోండి.' అన్నారు రాజారావు.

'ఇరవైవేలు!' సారథికి చెమటు పట్టినంత పనైంది. ఒక్కక్షణానికి తేరుకొని 'ఆయనకి కట్నం ఆశలేదనుకుంటానండి. పోదా, అంతసు చూస్తాడేమో ?' అన్నాడు.

'అయితే ఫర్వాలేదు. మా అన్నయ్యని ఆయన దిరిగేవుంటాడు... మీకు తీరికైనప్పుడు చెప్పండి, మంచిరోజు చూసి వెళ్లుదాం.'

'అలాగే.'

'ఒక్కక్షణం' అంటూ రాజారావు లోపలికి వెళ్లి వెంటనే తిరిగొచ్చాడు. అతని వెనక యిందాకటి అమ్మాయి కాఫీకప్పుల ట్రేతో వొచ్చింది. ఆమెవంక చూశాడు సారథి. మనిషి కుందనపు బొమ్మలా వుంది. సాదాసేత చీర ధరించింది. కుడి చేతికి నాలుగు సాదా గాజులు ఎడంచేతికి చిన్న గడియారం వున్నాయి. సౌందర్య

'మా అన్నయ్యగారమ్మాయి పేరు అరుణ. ఫైనల్ బి. యస్. సి. చదువు అయింది. ఈయన పార్థసారథిగారని నాకు మంచి స్నేహితులు' పరిచయం చేశాడు రాజారావు.

ఆ అమ్మాయి నమస్కరించింది. ప్రతి నమస్కారం చేశాడు సారథి.

కాఫీకప్పులు చెరొకటి యిచ్చి లోపలికి వెళ్లిపోయిందా అమ్మాయి

'ఊఁ! ఇంతకీ మీరొచ్చిన పని చెప్పారు కాదు?' అన్నాడు రాజారావు కాఫీ తాగడం ముగిశాక.

తనువొచ్చిన పని చెప్పడానికి తటపటాయింపులోపడ్డాడు సారథి. చివరికెలాగో గొంతు పెగుల్చుకుని 'నాకో వంద రూపాయిలు కావాలి. సర్దగలరా?'అన్నాడు.

రాజారావు చటుక్కున అతని ముఖంలోకి చూసి తలదించుకున్నాడు. స్నేహంలో డబ్బు అడగడం ఎంత బాధాకరమో ఆ క్షణాన ఛెళ్లున కొట్టినట్లు తెలియవచ్చింది సారధికి. ఆయన దగ్గర డబ్బు లేకపోవొచ్చు' లేక స్నేహం ఆసరాగా డబ్బు అడిగినందుకు 'బేవార్సుగాడు' అనుకోవచ్చు. కాని...

'అంత డబ్బు...యిరకాటంలో పెట్టేశారు సారధిగారూ' అన్నాడు రాజారావు క్షమాపణ చెప్పుకుంటున్నట్లు.

'పోన్లెండి' అన్నాడు సారథి హతాశుడై.

'నో నో! ఏమండీ అడగనివారు అడిగారు...పోనీ, నో పాతికలాభంటే సర్దగలను. తీసుకోగలరా?' అన్నాడు రాజారావు.

'హద్దులెండి' అనబోయిన సారథి 'మీ యిష్టం' అన్నాడు.

రాజారావు లోపలికెళ్లి డబ్బుతెచ్చి నింబడే ఆ డబ్బు సారథికి అందించాడు. వందరూపాయలు యివ్వలేకపోయినందుకు క్షమాపణ చెప్పుకున్నాడు. ఆతొందరేమీ లేదని, జీతంవొచ్చాకనే యివ్వవచ్చునని వొక్కి చెప్పాడు.

ఆయన దగ్గర సెలవు తీసుకుని వీధిలోకి వొచ్చాడు పార్థసారథి. అవసరంలో చాలుగోవంతు తీరింది. మిగతా దానికోసం మరోచోట ముష్టెత్తాలి. సందుమలుపు



# జెలగలు

తిరుగుతూండగా స్కూటర్‌మీద రయ్‌న వస్తున్న బాల్యమిత్రుడు నారాయణ కనిపించాడు సారధికి. సారధిని చూడంగానే స్కూటర్ ఆపి 'హలో కామ్రేడ్! ఎక్కడ నుంచి రావటం?' అన్నాడు.

సారధి చెప్పాడు.

'ఆయనొక్కడే వున్నాడా? యింకెవరన్నా వున్నారా?' ఆత్రంగా అడిగాడు నారాయణ.

'ఒక్కడేవున్నాడు. ఏమిటి కథ?' అన్నాడు సారథి.

'ఇవాళ చతుర్ముఖ పారాయణం వుందోయ్! పదిపైసల ఆట. వస్తావా?'

'జూదమా?'

'నీలాంటి చవటలు అలాగే అంటారనుకో!...అయినా వారానికొక్కసారి వచ్చే ఆదివారం. ఏదో కాలక్షేపం వుండొద్దూ?' అన్నాడు నారాయణ.

'సరే! వెళ్లు' అన్నాడు ముందుకు నడుస్తూ సారధి.

'బతికున్నందుకు ఎంజాయ్ చెయ్యాలోయ్' అంటూ దూసుకుపోయాడు నారాయణ. సారధికి నవ్వొచ్చింది. నారాయణ అతను స్కూల్‌ఫైనల్‌వరకు కలిసి చదువుకున్నారు. నారాయణది చాలా పేద కుటుంబం. దానికి తోడు నారాయణకి చదువులో అన్నిటి వెనుక మార్కులే. స్కూల్‌ఫైనల్ తప్పాక, అతను సెంటర్లో పేవ్‌మెంట్‌మీద బనీన్లు, తువ్వాళ్లు అమ్మడం ప్రారంభించాడు. ఇప్పుడు...

నాలుగురోడ్ల కూడలిలోకి వచ్చాక వొక్కక్షణం నిలబడ్డాడు పార్థసారధి. స్కూటర్లు, చిన్నకార్లు వొకదాని వెనుక మరొకటి బాణవేగంతో దూసుకుపోతున్నాయి. సెంటర్లో వొక పెద్దగా వున్న సినిమాహాలు ముందు హనుమంతుడి తోకలా పెరిగిపోయిన క్యూలున్నాయి. 'దేశంలో పేదరికాన్ని అపహసిస్తున్నట్లున్నాయి ఈ క్యూలు.' అనుకున్నాడు సారధి. నిజం అది కాదేమోనని అతనికి అంతరాంతరాలలో అనిపించింది. హాలుముందు పెట్టివున్న నిలువెత్తు బొమ్మల్లో అగ్రశ్రేణి నాయికా నాయకుల విపరీత శృంగార భంగిమలు కొత్త హుషారిచ్చినట్టు కనిపిస్తున్నాయి.

పార్థసారధికి హఠాత్తుగా సుబ్బారావు గుర్తొచ్చాడు. సుబ్బారావు కిలాంటి సినిమాలంటే పరమద్వేషం. అలాంటి నటీనటులన్నా, ఆ మాటకొస్తే అవినీతికరమైన పనులుచేసే మనుషులంటే కూడా ద్వేషమే.

సుబ్బారావు జనరల్ ట్రేడింగ్ కంపెనీలో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. రచయితగా అతనికి మంచిపేరున్నది. అతను రాసిన పాటలు కార్మిక సంఘాలకి వేదసదృశాలుగా వుంటున్నాయి. రెక్కాడితేగాని డొక్కాడని మనుషులు అతన్ని చాలా అభిమానిస్తారు. మనిషి నిరాడంబరుడు. స్నేహశీలి. కవిత్వంలో తప్ప విడిగా అతను ధర్మోపన్యాలసాలివ్వకపోవటం అతనిలోని నైర్మల్యానికి చిహ్నం అనుకుంటాడు పార్థసారధి.

అతన్నడిగితే తన అవసరం గడవదూ?

పార్థసారధి గబగబా అడుగులు వేశాడు. రెండు మెయిన్‌రోడ్లు దాటి, ఒకానొక సినిమాహాలు పక్కనవున్న సందులోకి తిరిగాడు. ఆ సందు చివరవున్న పెంకుటింట్లో సుబ్బారావు కాపురం వుంటున్నాడు. సారధి ఆయింటి తలుపు తట్టాడు.

సుబ్బారావు భార్య తలుపుతీసి, సారధిని చూసి 'ఆయన యింట్లో లేరండి' అన్నది.

సారధి హతాశుడై 'ఎక్కడికి వెళ్లారండీ?' అనడిగాడు.

'సాయంత్రం కవిసమ్మేళనం వుందిట. హైదరాబాద్‌నుంచి సత్యంగారొచ్చారంటే పొద్దుటే వెళ్లారు. 'బహుశా... హోటల్లో వుండొచ్చు' అన్నదామె.

సారధి నీరసంగా వెనుదిరిగాడు. అక్కడ తనికి ఎదురైంది నిరాశ అయినా, ఆ సంఘటనలో అతనికి సంతోషం కలిగించిన భాగం కూడా లేకపోలేదు సత్యంగారంటే ఆధునిక కవికులగురువు. ఆయన్ని చూసే అదృష్టం కలుగుతున్నది.

సెంటర్ దాటుతూండగా, అతనికి దూరాన చిన్ననాటి మిత్రుడు శేషగిరి కనిపించాడు. శేషగిరి హైస్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్నాడు. పెద్ద సంసారం

తతనిది. హాచ్చె కొద్దిపాటి జీతంతో అతను జీవనం ఎలా సాగిస్తున్నాడో సారధికి మిస్టరీగానే వుంటున్నది. ఒకర్ని యాచించడం, ఒకరి దయాధర్మాలు ఆశించడం తెలియనివాడతను. అతను సారధిని చూడగానే చిరునవ్వుతో పలకరించాడు. 'ఏమిటి దేశాటనం చేస్తున్నావు?' అనడిగాడు.

సారధి నవ్వుతూనే తన అవసరం చెప్పాడు.

'ఈ మాత్రం దానికి కాళ్ళరిగేట్లు తిరగాలిట్రా? మీ మామయ్యని అడగక పోయావా?' అన్నాడు శేషగిరి.

'ఛఛ' అన్నాడు సారధి.

'అదేం? ఆయనతో విరోధం వచ్చిందా?'

'ఆయనగారి పాపిష్టి డబ్బు నాకెందుకు ఏడర్?'

శేషగిరి ఆశ్చర్యంగా చూసి 'నువ్వేం ధర్మం అడగడం లేదుగా! అనవ్వే బంధుత్వంలో అప్పు అడగడం పాపం డదు మరి...పోక్క నాలుగురోజులు ఆగితే నేను సర్దుతాను. ట్యూషన్ పిల్లల జీతాలొస్తాయి' అన్నాడు.

'ఈ వాళ యివ్వకపోతే పరువుదక్కదోయ్! సోమసుందరరావుగారని ... నీకు తెలుసేమో! ఆయన కివ్వాలి. నాలుగేళ్ళ నాటి అప్పు' అన్నాడు సారధి బాధగా నిన్న జరిగిందంతా చెప్పి.

'సోమసుందరరావుగారంటే ఆ ఎలిమెంటరీ స్కూలు టీచరేనా?'

'ఊఁ'

'బావుంది' అన్నాడు శేషగిరి నవ్వుతూ.

'ఏం?'

'ఆయనకి తొందరేమిటోయ్? ఆయన లక్షాధికారి అని నేనూ అనను గాని, డబ్బులేక చచ్చిపోతున్నాడంటే నమ్మను. అవున్లే! గజలక్ష్మి ఫ్యాక్టరీలో షేర్లు కొనబోతున్నాడుగా. అందుకు డబ్బు కావద్దూ?' అన్నాడు శేషగిరి నిరసనగా.

గజలక్ష్మి ఫ్యాక్టరీ అంటే, సారధి మేనమామ విశ్వనాథంగారిది!

'సరే! నీ తిప్పలేదో నువ్వు పడు. అవసరం వుంటే నాలుగురోజుల తర్వాత రా! డబ్బు సర్దుతాను' అని వెళ్ళిపోయాడు శేషగిరి.

సోమసుందరరావును గురించి శేషగిరి చేసిన వ్యాఖ్యానం సారధికి కోపము తెప్పించింది. అవమానం... బాధ

# రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులంతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్ల యితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పరిమిత ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణించ బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

**షరా:** వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము; కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతని స్వీకరించలేము. ఈ షరతుని దృష్టినుంచి రచయితలు తమ రచనలు, కార్టూన్లను పంపగలరు.

సంపాదకుడు

ఆంధ్రపత్రిక వారపత్రిక

---

## వెలుగులు

డబ్బులు వెనకేసుకోవడం నేరమా? లోకుల్నిమించి, లోకాన్ని కొంటున్న తన మేనమామ విశ్వనాథంవంటి వారి సంగతి యిలాంటివాళ్లకి పట్టదు కాబోలు! ఇలాంటివాళ్లే డబ్బుగల రాస్కెల్స్‌కు ఆయుధాలుగా ఉపయోగపడుతున్నారు!

సుబ్బారావు భార్యచెప్పిన హోటల్ పేరు ఒక్కసారి మననం చేసుకుని, మరోసందు మలుపు తిరిగాడు పార్థసారధి. అప్పటికి ఎండ తీక్షణలో బాగా హెచ్చింది. అతనికి నాలుక పిడచకట్టుకు పోసాగింది, ఇదాక రాజారావు, యిచ్చిన డబ్బు మినహా మరొక్క పైసాకూడా అతని జేబులో లేదు. అందులోనుంచి తీసి ఖర్చుపెట్టడానికి అతనికి మనస్సొప్పలేదు. మరో నాలుగడుగులువేస్తే ఆ హోటలే వస్తుంది. సుబ్బారావు తన అవసరం గట్టెక్కిస్తే ఏకంగా యింటికెళ్లిపోయి నాలుగు మెతుకులు కొరకవచ్చు.

సావిత్రి నిజంగానే తమ యింట్లో భోజనం చేస్తుందా?

సారధికి ఆమెని తల్చుకుంటే జాలిలాంటిది కల్గింది. విశ్వనాథంగారి గారాల కూతురామె. ఎండ కన్నెరక్కుండా పెరుగుతున్నది. కాని, ఆమెకి బావమీద మేనత్త మీద విపరీతంబైన అపేక్ష. ఆ అపేక్షలో మరేదో మధుర భావంకూడా వున్నదన్న నిజం పార్థసారధికి తెలియకపోలేదు. కాని, ఆమె ధరించే చీనిచీనాంబరాలు, అలనాటైన జీవితం, వాటివెనుక గల కఠోర సత్యాలను సారధికి స్ఫురింపజేసి అతన్నామెకు దూరంగానే వుంచుతున్నాయి.

'హద్దు సావిత్రీ! నిన్ను చేసుకోవడం నాకు ఆత్మవంచనలో సమానం. హాయిగా మరో కోటీశ్వరుడి కొడుకుని చేసుకో!' అనుకున్నాడు పార్థసారధి...

దగ్గర్లో ఎవరో పెద్దగొంతుతో తిడుతున్న తిట్లు వినరావడంతో సారధి ఆలోచనలు ఆగిపోయాయి. ఆ సందు పక్క గల్లీలో చిన్న గుంపు పోగైవుంది. ఎవరో ఆరవాళ్యయిన తిడుతున్నాడు. 'దొంగలం... యింతడబ్బు దాచుకుని నా జాకెట్ తేయుటావా? యిందుకేరా! మీ బతుకు కుక్కబతుకైంది' అని. అక్కడినన్ని బూతు మాటలు. వాటిలో ఒకదాని ముందు జరుగుతున్న తతంగం అంది.

ముందుకు అడుగువేయబోయిన సారధి కాలికి రాయితగిలి ప్రాణం జివ్వుమనక పోయింది.

ఇసారి ఆ అప్పుపడినవాడి గొంతు కాబోలు దీనంగా వినిపించింది. 'నా కూతురు డబ్బయ్యా అది. నాకాడ దాసుకుంది. ఈ ఒక్కసారికి కాయండయ్యా! వారం రోజులలో...'

బుజంవాత ఛర్రుమన్నాడు: 'ఆ వారం రోజుల్లో ఆ గబ్బేదో నీ కూతురికే యిచ్చుకో! తప్పుకో! మీద పడతావేం?' అన్నాడు.

పేదవాడి అంటుకూడా సోకరాదు కాబోలు అనుకున్నాడు పార్థసారధి. ఆ ధర్మాత్ముడెవరో చూడాలనిపించిందతనికి. మరుక్షణాన అతని కోరిక తీరిపోయింది. జవాన్ని చీల్చుకుని గల్లీకి అటుదోవపట్టిన ఆ పెద్ద మనిషిని లిప్తపాటు అతను చూడగలిగాడు.

సోమసుందరరావు!

ఒక్కసారిగా నీరసం ఎక్కువైపోయి పట్టయింది పార్థసారధికి. గల్లీలో చేరిన గుంపు తలోకమాట అనుకుంటూ చెదిరి పోతున్నారు. విషణ్ణ వదనంతో, దిక్కుతోచక నిలబడిపోయిన ఆ ఋణగ్రస్తుడు ఆ వెనక గుడిసెదగ్గర కన్నీరొత్తుకుంటూ నిలబడ్డ ఆడకూతురులు కనిపించారు సారధికి.

అతనికి జీవితంతో తొలిసారిగా సోమ సుందరరావుమీద అసహ్యం వేసింది. ఆ దిక్కుమాలిన వాళ్లమీద జాలితో అతనికంట నీరు తిరిగింది. మరుక్షణాన నవ్వొచ్చింది. వాళ్లకన్నా ఏమంత మంచి స్థితిలో వున్నాడుతాను?

నీరసాన్ని అదుపు చేసుకుని అతను... హోటల్ చేరుకున్నాడు. కౌంటర్‌దగ్గరకి వెళ్లి 'సుబ్బారావుగారు కావాలి. వర్కర్ వాళ్లతో మాట్లాడాలి' అన్నాడు.

కౌంటర్లో వున్న హోటల్ యజమాని

'ఆయన చాలా బిజీగావున్నారు: యెవ్వరితో మాట్లాడరు' అని అప్పుడే హోటల్ ముందు ఆగిన రిక్షానిచూచి 'రండి రండి' అంటూ లేచినిలబడ్డాడు.

ఎవరో సిల్కులాల్చీ, గ్లాస్కోపంచె ఆసామీ లోపలికొచ్చాడు. అతని వెనకాలే రిక్షావాడొచ్చి, చిన్న చెక్కపెట్టె అక్కడ పెట్టి డబ్బులు తీసుకువెళ్ళిపోయాడు. 'కొబ్బరికాయలా?' అనడిగాడు హోటల్ యజమాని నవ్వుతూ. ఆయన కూడా నవ్వుతూ 'సార్! కవి దేముళ్ళకోసం, అప్సరసలొచ్చారా?' అన్నాడు. హోటల్ యజమాని సారధివంక తిరిగి 'మాశారుగా! దర్బార్‌లో వున్నారు. ఇక మీరు వెళ్ళిరండి' అన్నాడు.

దేవకన్యలు! కొబ్బరికాయలు! మైగాడ్!

సారధికి నిస్పృహ ఆవరించినట్లయింది. సర్వర్ నడిగి కాసిని మంచినీళ్ళు తాగి, హోటల్ బయటికి వొచ్చాడు. నాలు గడుగులు వేసేసరికి యిందాకటిగల్లీ వొచ్చింది. సోమసుందరరావు తాకిడికి గురైన అభాగ్యుణ్ణి ఎవరో అనునయిస్తున్నారు: 'అయినా నేసెప్తే ఇన్నావంట్రా? ఆయనేదో నోకరచ్చుకుడన్నావు! దరమ పెబువన్నావు. ఏటైందిప్పుడు?... పాము కాటేత్తే పాణం పోతాది. కాని యియ్యి జెలగ్రలా నాయనా? రకతం పీల్చేసా యి!' అంటున్నాడు.

సారధి ఒక్కక్షణం ఆలోచించాడు. చటుక్కున ఒక నిర్ణయానికి వొచ్చి లాల్చీ జేబులోంచి పాతిక రూపాయలు తీశాడు. గబగబ వాళ్ళవేపు వెళ్ళి, ఆ అభాగ్యుడి చేతిలో ఆ డబ్బుపెట్టి 'ఈ డబ్బు నాకు దొరికింది. ఉంచుకో!' అంటూ వడివడిగా యింతలికి వొచ్చేశాడు.

అతనికాక్షణాన తన తల్లి కుట్టుమిషన్ కళ్ళలో మెదిలింది. అప్పు తీరే మార్గం గోచరించింది. అదేక్షణాన అతనికి కసితో అణువణువు భగ్గున మండింది. ●

# తండ్రులూ—తనయులూ



## ధర్మపథం • బులుసు వేంకటరమణయ్య

తనకు జన్మమును అనుగ్రహించిన వాడే తండ్రియని ప్రసిద్ధం. కాని ఆయన కాకుండా మరి యిద్దరూ తండ్రులుగా భావింపబడుతున్నారు. వారు జ్యేష్ఠభ్రాత యున్నూ, విద్యాగురువున్నూ, 'జ్యేష్ఠభ్రాతా పితృ సమానః' అనే సూక్తి ప్రసిద్ధంగా ఉన్నది. తండ్రి కాలగతినిపొందితే, ఆతర్వాత కుటుంబపోషణబాధ్యత వహించవలసినవాడు పెద్ద కుమారుడే! తమ్ముళ్ళ విద్యాబుద్ధులనుగురించీ అతడే బాధ్యత వహించవలసి వున్నది. అలా జరుగుతూ ఉండడం ఈ నవీనయుగంలో కూడా చాలాచోట్ల కాన వస్తూ ఉన్నది. సుమిత్రాదేవి—ఆ రాముని తోకూడా అడవికిపోతున్న తన కుమారుడైన లక్ష్మణునితో 'రామం దశరథం విద్ధి—' అంటూ జ్యేష్ఠ సోదరుడైన రాముణ్ణి తండ్రియైన దశరథునిగా భావించవలెనని కోరినది.

ఇక—గురువు తండ్రి ఎలా అయే డంటారా?

మన ప్రాచీనులు వంశాలు రెండు విధాలన్నారు. పుట్టుకకు సంబంధించిన వంశం ఒకటి. రెండవది విద్యావంశం. తండ్రి, తాత, ముత్తాతలవలెనే శిష్యుడికి తండ్రివంటి గురువూ తాతవంటి పరమ గురువు—ఈవిధంగా ఉంటారు. ఈవంశం గురువు, ఆ గురువు గురువు, అతని గురువు—ఈవిధంగా ఉంటుంది. గురువు శిష్యుణ్ణి కుమారునిగా భావించి, తన యింటిలోనే భోజనంపెట్టి, విద్యాబుద్ధులు నేర్పుతూ ఉంటాడు. అందువల్ల ఆయన తండ్రితో సమానుడే!

మనిషికి యీ ముగ్గురూ తండ్రులే! అయితే—వీరు ముగ్గురున్నూ—వారు వారు ధర్మంగా నడుచుకొనేటప్పుడే తండ్రులుగా చెప్పబడుతారు. వారు అధర్మంగా నడుచుకుంటే మాత్రం తండ్రులమని చెప్పుకునే హక్కువారికిలేదు.

ఈ విషయాన్నే—

'జ్యేష్ఠభ్రాతా పితాచైవ
యశ్చ విద్యాం ప్రయచ్ఛతి,
త్రయస్తే పితరో జ్ఞేయాః
ధర్మ్యే పథి హి వర్తినః.'

అనే శ్లోకం తెలుపుతున్నది.

'తన సోదరులలో పెద్దవాడున్నూ, తండ్రియు, తనకు విద్యనునేర్పిన యతడును—ఈ ముగ్గురూ తండ్రులని తెలుసుకోవలెను. వారు ధర్మమార్గాన్ని అతిక్రమించకుండా నడుచుకున్నప్పుడే తండ్రులు కాగలరని తెలుసుకోవలెను' అని దీని అభిప్రాయం.

ఈ విధంగానే అన్న తన తమ్ముడినీ, తండ్రి తన కన్న కుమారుణ్ణి, గురువు మంచి గుణాలుండే తన శిష్యుణ్ణి పుత్రునిగా భావించవలెను. ఆ చిన్నవాని యందు మంచిగుణాలు లేని పక్షమునను, అతడు ధర్మము ననుసరించి — అంటే — తాను నడుచుకోవలసిన విధంగా నడుచుకోని పక్షమునను పుత్రునిగా అనుకోవడం కుదరదు.

ఈ సంగతినే ఈ శ్లోకం తెలియజేసున్నది—

'యవీయా నాత్మనః పుత్రః
శిష్యశ్చాపి గుణోదితః,
పుత్రవత్తే త్రయశ్చింత్యాః
ధర్మశ్చేదత్ర కారణమ్' ●



# అతనేలక్ష్యం

**గుళ్లపల్లి సుందరమ్మ**

## జరిగిన కథ

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్నదమ్ములు. వాళ్ల ముద్దుల మరదల సుధ. సుధ కుంటిపిల్ల, సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి బాధితురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయమిచ్చారు శర్మగారు ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం. సుధ తండ్రి యుద్ధానికి ఎలా బలి అయిపోయిందీ జానకమ్మ వివరించి చెబుతుంటే పార్వతమ్మ, వేణు ఆసక్తిగా విన్నారు. తండ్రి మరణాన్ని తలచుకుని బాధపడింది సుధ. రాజమ్మగారు సుధని చూసినప్పుడల్లా కుంటిపిల్ల అని ఎత్తిపొడుపుగా మాట్లాడుతుంది సుధ బాధపడుతుంది. రఘు సుధ మీద ఎక్కువ అభిమానం చూపిస్తూ వుండడం రాధ కలిపెడుతూనే వుంది. రఘుని ఆకర్షించడానికి రాధ విఫల ప్రయత్నాలను చేస్తుంది. కార్యసాధనకు మంచిదని ట్రాన్స్‌ఫరయిన అన్నయ్య తిలక్ కుటుంబంతో హసాన్ సర్జరీకి విశాఖ చేరుతుంది. తను ప్రేమించిన నళినితో తనకు వివాహం జరిగేలా చూడమని వదిన నిర్మలను కోరుతాడు మురళి.

## 7

నిర్మలతో నళినికి పరిచయం చేశాక దాన్నిగురించి నళిని తన అభిప్రాయం ఏమన్నా చెపుతుందేమోనని కొద్ది రోజుల పాటు ఎదురు చూశాడు మురళి. అయితే అలా ఏమీ చెప్పలేదు సరికదా అటువంటి ప్రయత్నం ఏమీ జరగనట్టుగా ఎప్పట్లా తనపని తను చూసుకుపోతూంది నళిని. నళిని ప్రవర్తనని అసమ్మతంగా అర్థం చేసుకోవడమా! ఏమీ అర్థంగాక అయోమయంగా వుంటుంది మురళికి.

రోజూ మొహం తేలేసుకుని ఇంటి కొస్తూండే మురళిని చూచి నవ్వుకునేది నిర్మల.

'మీ అన్నగారిచ్చిన గడువు దాటిపోవస్తూంది. మరి ఇంకా ఏ ప్రయత్నమూ పూర్తికాకపోతే ఎలాగా' అంది ఒకరోజు టీ తాగుతూండగా.

'అదే నాకూ అర్థం కావడంలేదొదినా, ఏదో సామ్యం చెప్పినట్టు పరిచయం చేశాక, అసలే నాతో మాట్లాడడం మానేసిందా పిల్ల... ఇది అయిష్టసూచనంటావా?' కాస్త ఆగాక అన్నాడు.

'మరి మీ ఇద్దరికీ మాట్లాడుకోవడమే అసలలవాట్లేదేమో!' నవ్వాపుకుంటూ అంది.

'అంతే అంతే, ఏ మెడిసన్‌ల విషయంగా—నన్నా, అడుగుతుండేదిగ, ఇపుడదీ లేదు' దివాలా పడ్డట్టు మొహంపెట్టాడు మురళి.

'ఎందుకల్లనో?' ఎంతో అహంభావంగా ఎసర్బీ లక్ష్యం చెయ్యనన్నట్టుగా మసు కుంటూండే మురళిలో ఈమార్పు చూసి, మనసిచ్చినచోట మార్దవం నానంతటదే పుడుతుందేమో! అనుకుంటూ అడిగింది నిర్మల.

'ఏమో, నిన్న రఘుతో ఆ సంగతి చెపితే. అమాంతంగా నిన్ను మాస్తే ఆపిల్లకింత సిగ్గెపుడు ప్రారంభమయిందో అది తప్పకుండా అంగీకారసూచనే, భయపడకు' అన్నాడు. అంటే ఈ విషయంలో ప్రతిసంగతీ అతని సలహా తీసుకునే జరుపుకున్నావన్నో? నేను నిజం చెప్పాలంటే, చలచిత్తగాణ్ణయిన నాలో ఇంత స్థిరత్వం కుదిరిందీ అంటే అది తప్పకుండా దృఢభావంగల రఘు పరిచయంవల్ల ఏర్పడ్డదనే చెప్పాలి. అలా కాకపోతే ఇంతమంది యువతులమధ్య మసుల్తూండే నా ప్రవర్తన ఎన్నెన్ని మరవళ్లు తొక్కుండేదో' అన్నాడు. శూన్యంలోకి చూస్తూ మురళి.

'మరి నళిని విషయంలో అంత సబబుగా సలహా ఇవ్వాడంటే అతని కిటువంటి వ్యవహారాల్లో కొంత అనుభవం వున్నట్లేగా!'

'ఉండొచ్చు. అయితే అది ఊహామాత్రపుదిమాత్రమే ఎందుకంటే, అతని చుట్టుపట్ల తిరుగుతూంటే యువతులందరూ అతన్నేతరుచుగా చూస్తూండడం కనిపిస్తూందిగాని. ఇంతవరకూ అనవసరంగా అతనెవ్వరివేపు చూడ్డం నేనూ ఎరగ, ఎంతసేపూ అతని ప్రాక్టికల్సూ, అతని ఆలోచన్లూ, ఎప్పుడూ ఏవేవో పరిశోధన్లు అలా చేస్తూనే వుంటాడుగదా, మరి అతనికెంత విసుగు లేదోగానీ...'

'మరి రాధకోసరం కనుక్కోమన్నారేమో, మీ అమ్మగారు!'

'ఆ అందనుకో. అయినా తన స్వలాభ విషయాలన్నీ మరిచి అతని ఆదర్శాలకి దోహదం చెయ్యగల్గే ఏమంచి యోగ్యురాలైనా అయితేనేతప్ప. లేకపోతే అతనికి ఆ చేసుకున్నవారికీకూడా సుఖం వుండదని నా విశ్వాసం. ఏమంటావ్.'

'నిజమేనూ'

'మరి మన సరోజలో ఈ అలవాట్లున్నట్టు కన్నా రావనావే.'

'సరోజ —ఎలావున్నా అతని ఆశయాలకి అనుకూలంగా వుండేపిల్ల దొరకడమన్నది చాలా కష్టమే అవుతుందేమో.'

'ఆ మనకు తెలిసినంతలో లేరేమోగానీ. అతని కెవిటోదినా. బంగారానికి పరిమళంకూడా. అబ్బ నటువంటి అతన్ని చేసుకుందుకు, సై, అంటే చాల్ననుకునే యువతులెందరో సిద్ధంగా వున్నారు. చూడబోతే ఇంకా హసాన్ సర్జనని పేరు. అప్పుడే ఎముకల్ని అతికించడం, కృత్రిమంగా వేరే ఎముకలో అంగవైకల్యాన్ని సరి చేస్తూండడం ఇటు

వరటి వాటిల్లో ఎంతమంచి అనుభవం, ఎంతమంచిపేరూ సంపాదించేసాడో! ఇక బోన్సుకి సంబంధించిన ఏకేసైనా అందుకు ప్రత్యేకంగా చూసే డాక్టర్లు అతణ్ణి పిలవందే, ఆపరేషన్ ప్రారంభించరు గదా!'

'ఆసక్తి చూపేవారికి అలా అవకాశం ఇవ్వడం ఎంతో విధాయకం మరి. ఇంతకీ అతను ఈ 'బోన్-క్యూరింగ్‌కోర్సుని స్పెషలైజ్' చేస్తున్నాడనుమాట' అంది ఏదో ఆలోచిస్తూ నిర్మల.

'మరే! ఆ చెయ్యడంలోనూ అతని ఆసక్తి ఇక చెప్పతరం కాదనుకో. రాత్రింబవళ్ళు ఇక అదే ధ్యానం. అదే ప్రయత్నం. అంటే ప్రజలందరి అదృష్టం బాగుండి అతని ప్రయత్నాలే గనక ఫలించాయంటే, ఇక ఈ దేశంలో అవిటివారే వుండరనుకో.'

'అబ్బా దైవ కృపవల్ల ఆ ప్రయత్నాలు కొనసాగితేనూ...'

'తప్పకుండా అతి త్వరలో ఫలిస్తాయన్న విశ్వాసం మా కందరికీ వుందోదినా. అంత గొప్ప స్థాయిలో జరుగుతున్నాయి అతని ప్రయత్నాలు. అంతెందుకూ. ఏళ్ళతరబడి ఇటువంటి కేసుల్ని చూడ్డంలో గొప్ప నిపుణులని పేరు సంపాదించుకున్న స్పెషలిష్టులంతా కూడా కొన్ని కొన్ని ఎటూ పట్టుపడని కేసుల్లో అతణ్ణి పిలిచి ఉపాయా లడుగుతున్నారంటే ఇక చూసుకో.'

'ఆశ్చర్యవేవిటీ! అసలు నమ్మతగేటట్టే లేదూ?'

'ఆ...అదీ. అంటే అతని ఆలోచనా దృష్టంతా, ఎప్పుడూ ఈ విషయాల్లోనే కేంద్రీకరించి వుండడంవల్ల ఇక చదువులోనూ, నేర్చుకోడంతోనూ నిమిత్తంలేనంత అపూర్వమైన ఊహలు అతనికి స్వయంగా కల్గుతూండడంవల్ల క్రమశిక్షణతో అదే ఆధారంగా పని చేస్తూండే ఈ మిగతా డాక్టర్లకి ఆ శాస్త్రప్రకారం పట్టుపడని కేసుల్ని కేవలం ఊహించడంతోనే ప్రత్యేక అనుభవాల్ని సంపాదిస్తున్న అతనికి పట్టుపడుతున్నాయన్న మాట, ఇప్పుడర్థమయిందా.'

'ఆ అంతే అవకూడదు గాని మరి ఇంత తమోఘరంగా మెదడు పనిచేసేవాళ్ళి చాలా జాగ్రత్తగా చూసుకుంటూవుండలి. అంటే ఈ శక్తికిమించిన ఆలోచనల్లతో నరాలు బలహీనపడి ఏ మతిభ్రమవంటి ప్రమాదమన్నా సంభవించొచ్చుకూడా.'

'ఆ. ఈ 'పాయిన్ట్'ని గురించే మొన్న ఈ మధ్య జర్మనీ నించొచ్చిన ఒక పెద్ద డాక్టరు ప్రత్యేకంగాచెప్పాడు. అందులోనూ మా ప్రిన్సిపల్ అంటే మునపటి సూపరెండెంటన్నమాట్లో, రఘుని గొప్పగా ఆ డాక్టరుకి పరిచయం చేస్తే, 'నీ వల్ల వైద్య శాఖ కెంతెంతో ప్రయోజనం వుంటుంది గనక. అందుకని ముఖ్యంగా నీ ఆరోగ్యాన్ని అతి జాగ్రత్తగా కాపాడుకోవాలి తెల్సునా. అంటూ ప్రత్యేకంగా అతన్ని హెచ్చరించారాయన. ఆయనద్వారానే ఇప్పుడు రఘుకి అమెరికావెళ్ళే అవకాశం కల్గుతూంది.'

'అన్నట్టు అతనికి మేనరికంకూడా వున్నట్టుందే.'

'ఆ ఒక్కకాలు వంకర తప్పిస్తే, ఆ పిల్లలో ఇక ఏలోపమూ నా వరకూ కని



పించదు? ఇక పాటని గురించి చెప్పాలంటే ఆ పిల్ల కాపిల్లే పాటి'

'మరి అంత స్నేహితులేమో, మీతో ఈ విషయం ఏమీ చెప్పలేదా, అతనూ'

'అబ్బే. అతని మనసు చాలా లోతు. ఏ విషయాన్నీ దబ్బున పైకి తేలడు. అయినా 'వేలుజార్నా తీసుకోవచ్చు గాని మాటజారితే తీసుక్లోలేం' అన్నట్లు ఇందరి మధ్యా మసలుతూండే వారికి ఎప్పుడు బుద్దేటుపోతుందో. ముందు మాట బయట పెట్టెయ్యడం అంత మంచిది కాదనుకో ! అయినా అతనిది చాలా గొప్ప మనో నిబ్బరం. ఏమో ఆపిల్లనే చేసుకుని తన పెర్సరితనంతో చక్కగా సరిదిద్దుకుని అందరికీ తనొక ఆదర్శనీయుడయినా అవచ్చు. చెప్పలేం.'

'నిజంగా గనక అతవలా చేశాడంటే అది చాలా ప్రశంసనీయమైన త్యాగం అవాలి. అంటే, అతవలా చెయ్యాలంటే సిద్ధంగా ఎదుటనున్న ఎన్నెన్ని అవకాశాల్ని నిబ్బరంతో ఎదుర్కొంటూ ఎప్పుడో లభ్యమవబోయే ప్రతిష్ఠకోసరం ఎన్నాళ్ళు ఎన్నెన్ని ఇబ్బందుల్ని ఎదుర్కోవాలసిఉంటుందో అది మనకి ఊహాతీతం. ఇంతకీ ఈ ప్రయత్నం సాధారణమైనవల్ల అయ్యే దెంతమాత్రం కాదని నా అభిప్రాయం. నిజమేనని అంటారా.'

'తప్పకుండానూ. అయినా రఘు ఇందులో జయించే తీరుతాడని నా దృఢ విశ్వాసం' అంటూ లేచి వళ్ళు విరుచుకున్న మురళి 'అబ్బో, అయిదయిపోయిందే?' ...అన్నాడు వాచీ చూసుకుని ఆశ్చర్యంగా.

'రేపు మీకు శెలవేనా' నవ్వుతూ అంది.

'అంటే'

'విజయవాడ వెళ్ళేందుకు.'

'అలూ లేదు, చూలూ'—

'అలివుంది అతి త్వరలో ఆ రెండోదీ. తెలిసేవుందిగాన్నీ, మీ మాట చెప్పండి.' అంది నవ్వుతూ.

'నాకు వీళ్ళకేం వుందిగాని మీరు సరిగ్గా చెప్పండి ముందు. మళ్ళీ వాళ్ళ నెప్పుడు కల్పుకున్నారూ.'

'రోజూనూ అంటే, ఏదో ఒకవేళ ఆ అమ్మాయి కనిపించి వెళ్తానేవుంది పాపం.'

'ఆ? అయితే నేనే నా కానివాణ్ణయ్యానూ? మీరన్నా ఇంతవరకు చెప్పనే లేదేం నాతో?' కాస్త ఓర్పులేనితనంగానే అన్నాడు మురళి.

'తొందరపాటూ, కోపం, ఈ రెండూ ఆపిల్ల కసలే గిట్టవు'—

'చచ్చాం, నాకున్న జబ్బులు అవి రెండేనూ'—

'ఛా, ఊరుకోవల్సిరా' అన్నట్టు 'ఏం మాటలుగానీ, మీకు నిదానం, శాంతం, అలవాటనీ, అనుకునే—'

'ఇద్దరూ ఈ ఎత్తు వేశారన్నమాట'

'మరే. తనువెళ్ళి మాట్లాడి వస్తానంటూ వాళ్ళ నాన్నగారూ ఒకసారి వచ్చారు. ఎందుకయినా, మేం ముందు చెప్తేనేగాని తొందరపడొద్దని స్పష్టంగా చెప్పేశాను.'

'రక్షించావ్'

'మీ అమ్మగారు ఏవిధమైన లోకువావార్నీ, వారి కూతుర్నీ చెయ్యకుండావుండేటట్టు మీరు హామీ ఇచ్చారంటే ఇక పెళ్ళివిషయంలో మీరు కోరినట్టూ అన్నీ నడిపించేందుకు వారి కేవిధమైన అభ్యంతమూ లేదుట'

'వారికి లేకపోయినా నాకుంది వదినా! వారు వారంతట వారే ఇష్టపడి నడిపించేవి తప్ప ప్రత్యేకంగా మనం ఏమీ పురమాయించకూడదని అమ్మతో స్పష్టంగా చెప్పేస్తాను. ఇంకా వాళ్ళ విషయంలో సర్దుకోవాల్సిన వేవన్నా వున్నాయా.'

'నాకు తెల్సినంతవరకూ ఇంతే'

'అలాక్కా దొదినా. ఈ విషయంలో మీకు పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చేశాం '

'అబ్బే. పెద్దవారు అమ్మ వుండగా'—

'ఆ గౌరవం ఆవిడకిచ్చి మీ ధర్మం మీరు చూపించుకున్నారు. మీ వరకూ అలా చెయ్యడం న్యాయమే. అయితే ఆ మర్యాద అమ్మ నిలబెట్టుకోదు ... అందుకే. ఈ విషయాల్లో నన్నెవరేమనుకున్నా సరే, నాకు భయంలేదు గానీ న్యాయ విరుద్ధమైన పనిగానీ, ఆడపిల్ల గలవార్ని లోకువ పరచాలను కోవడంగానీ ఇటువంటి వాటికి నే నెంతమాత్రం ఒప్పుకోను ...'

'ఆః! ఇటువంటి దురలవాట్లు మనో ల్లో నశించిపోవాలంటే మీలాంటి వాళ్ళు కొందరుండాలి...' అనుకుంది నిర్మల.

'మౌనం వహించారేం ?' అన్నాడు మురళి.

'అబ్బే. మీరెంత అనుభవంగా చెప్తున్నారో' అనుకుంటున్నా అంతే.

'ఔ వొదినా ఆపాటి మొండి కెత్తకపోతే మనలోని దురలవాట్లని కొద్దిపాటైనా ఖండించలేం'

'సరి, మీరు స్వయంగా ఈ విషయాలన్నీ మాట్లాడవలసున్నప్పుడు ఇక నేను కూడా ఎందుక్కూ.'

'చెప్తాగా! వో చిన్ననాటకం ఆడాల్సుంటుం దక్కడ. లేకపోతే పనిజరగదు.'

'ఏవిటి బాబూ అదీ...'

'చెప్తానన్నాగా, అన్నట్టు రాధకీ విషయాలేవన్నా తెల్సా.'

'బయట ఏవన్నా తెలస్తున్నాయేమో నే నెరగనుగాని ఇంట్లోవరకూ ఏమీ తెలియవ్.'

'రక్షించారు. అయితే ఇక మన ప్లాన్ తప్పకుండా ఫలిస్తుంది. పాపం అమ్మ రాస్తున్నదాన్నిబట్టి చూస్తే. ఇంతవరకూ ఓపాతిక సంబంధాలన్నా ఎంచి వుంచుండాలి. అందులో తప్పనిసరిగా ఇప్పుడు పెళ్ళిచూపులు జరగవలసినవి అధమం ఓపదన్నా వుంటాయి. ఎలా తప్పించుకోవడమో ఏమో!' ఒక్క నిముషం ఆలోచనగా నిలబడ్డాక 'ఓసారలా బీచికేసి వెళ్ళొస్తా వొదినా. బాబునికూడా ఇలాఇయ్యి' అంటూ అడిగి పుచ్చుకుని వదిలంగా స్కూటర్ ముందరివేపు నిలబెట్టుకుని వెళ్ళిపోయాడు మురళి.

అనుకున్న ప్రకారం ఆ మర్నాడు నిర్మలా, మురళీ విజయవాడకి వెళ్ళారు. మురళీ ఊహించుకున్నట్టే వరసగా పెళ్ళికూతుర్ని చూడ్డం, వాళ్ళల్లో ఏ ఒక్కరూ తనకి నచ్చలేదని మురళి చెప్పెయ్యడం జరిగాక—

'వున్నవాటిల్లో పిల్ల బాగున్నవీ. మనకి అన్నివిధాలా కలిసొచ్చేవిగా ఏర్పరిచి అవి చూపిస్తేనే నచ్చలేదు పొమ్మన్నవాడు ఇక మిగతావి— వీడికేం నచ్చుతాయే' అన్నారు చిరాకు పడుతూ రాజమ్మగారు...

'పోనివ్వండి. ఇంతకన్నా మంచివి వచ్చినప్పుడే చూడొచ్చు' అంది సర్దు

చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !



రాజాగా తిర్గుతారా
'అలాగని ఊరుకుంటుంటా పెళ్లికింకా ఎక్కడెవరో వెంట తిరుగుతూంది' అలా ఇలా అంటూ ఏవేవో పుకార్లు చెవిని పడుతున్నాయి కదా!' అన్నారు నొచ్చుకుంటూ కాస్త గొంతుకతగ్గించి రాజమ్మగారు.

'పోనీ అక్కడే మనవాళ్లపిల్ల లెవరైనా ఉన్నారేమో మరువ్వు కాస్త కనుక్కోరాదూ'

'అక్కడా! అత్తలో పనిచేసే మనవాళ్లపిల్లే ఒకమ్మాయుంది. పెళ్లిచెయ్యాలని వాళ్లవాళ్ళుకూడా అంటున్నారు—'

'అయితే కనుక్కోరాదూ' ఆదుర్దాగా అన్నారు రాజమ్మగారు.

'అలాగే కనుక్కుంటా కాని వాళ్లంతా కాస్త స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలవాటు పడ్డవాళ్లు.'

'ఆ అయితేమట్టుకేం వాళ్లమూలాన్న వాళ్లుండేటపుడు స్వేచ్ఛకు ఇక్కడెవళ్లడ్డొస్తారని' అన్నారు. 'నీమీద అధికారాన్నిచెలాయించడంతో నా సరదాలన్నీ తీరిపోయుంది సుమా' అన్నట్లు.

'మరి మిగతావన్నీకూడా—'

'ఆ వాళ్ళఇష్టం ఏం చేసుకొన్నా సరే. వాళ్ల పెట్టుపోతలెవరిక్కావాలని' అన్నారు. ఆ విషయంలోకూడా నాక్కావలసినవన్నీ మీవాళ్ల దగ్గర గుంజడం అయిపోయింది సుమా' అన్నట్లుగా.

# అతని లక్ష్యం

'అలాగైతే ఇంకేం అడ్డూ! మీరన్నట్టు ఎవర్తెనో చేసుకోవడంకన్నా, సాంప్రదాయంగల ఈ సంబంధం అన్ని విధాలా బాగానే వుంటుంది.' అంది. 'ఈమురళి ఎంతచక్కని ప్లానువేశాడూ' అనుకుంటూ.

'అందుకే ఆ స్నేహాలేదో ముదిరేలోగా ఈ సంబంధం ఒప్పించెయ్యి. వాడూ అక్కడేగా వుంటాడూ' అన్నారు తృప్తిగా.

'అలాగే అత్తయ్యా ఏసంగతీ వెంటనే మీకు తెలియజేస్తాలెండి' అంది. అలా రావాలి దోవకి అనుకుంటూ.

'నే చెప్పినమాట మర్చిపోకేం' అని వాళ్లు తిరిగి విశాఖకు బయల్దేరుతుండగా రాజమ్మగారు కోడల్ని హెచ్చరించడం విని.

'ఏమిటది ఒదినా అన్నాడు?' ఏమీ ఎరగనట్టు మురళి.

'నాచేత కొన్ని అబద్ధాలాడిస్తే ఆడించారు గాని. ప్లానుమాత్రం మాగొప్పగా వేశారేలెండి. ప్రతిప్రయత్నానికీ అడ్డంటూ చెప్పకుండా ఠకీ ఠకీ అయిపోయాయి పన్లు' అంది రైలు కదిలాక నిర్మల.

'రాతిగుండకు ఇనపకెద్దుండా లోదినా మీకు తెలియదూ...శ్రమనుకోకుండా నాకోసరం ఇన్ని ఇబ్బందులూ పడ్డందుకు చాలా 'థేంక్స్' ఒదినా' అన్నాడు బాత్‌రూమ్‌కెళ్లి డ్రస్సు మార్చుకొచ్చిన మురళి.

'మనోమనకే పారమాలిటీస్ ఏమిటెండిగానీ ఏకంగా ఇంత నాటకం ఆడేందుకు ధైర్యం తెచ్చుకున్న మీరు. ఈ విషయాన్ని స్పష్టంగా మూడుమాటల్లో మీ అమ్మగారికి చెప్పేసుంటేపోయేదేమో.

'మొదట అలాగే అనుకున్నా ఒదినా. అయితే అమ్మదిఅదోరకమైనతత్వం. అలా చేశానంటే అక్కడికి నేనేదో తనని మహా లోకువ చేసినట్టు ఫీలవుతూ ఆ అహంకారంకొద్దీ, ఎన్నన్నా గొడవలు లేవదీస్తుంది. అందువల్ల మన పరువు పోడం మాటలావుంచి రాత్రింపవళ్లు అవే తల్చుకుంటూ అహంకారం పెంచుకుందంటే! అసలే హై బ్లడ్‌ప్రెషర్ మనిషి? వోదాని కొకటయిందంటే మళ్లీ ఇబ్బందని ఇన్నిచుట్లూ, తిరగాల్సొచ్చింది' అన్నాడు మురళి.

'నిజమే ఇలా చెయ్యడంలో— ఆవిడకీ తృప్తిగా వుంటుంది. పాపం. ఆవిడ కోసరం, అ. 'ఎవత్తెనో' మానుకుని నే చెప్పిన పిల్లనే చేసుకుంటున్నాడనీ, పొంగిపోతారు. ఏమైనా మీరు అన్నదమ్ములంతా ఎంతకన్నా తగుమరు బాబూ' హాస్యంగానే అంటించింది నిర్మల.

'ఆ. మీరేం తక్కువ తిన్నారని' వారం రోజులుపాటు నన్ను సందిగ్ధావస్థలో ఒదిలి, ఇద్దరూ ఎంత కుంభకోణం చేశారనీ, అంటూ అప్పర్ బర్త్ కెళ్లిపోయాడు మురళి బాబుని జోగొడుతూ అలాగే సోఫాకు జేరబడి కన్నుమూసింది నిర్మల. విశాఖ చేరగానే ఈ వివరాలన్నీ నిర్మల తన భర్తతో చెప్పేసరికీ...'అచ్చా నాకు నచ్చావురా. తమ్ముడూ' అంటూ హాస్యంగా మురళి వీపుమీద తట్టాడు తిలక్.

'ఆ మర్నాడు నిర్మల నళినీ వాళ్లింటికి ఫోన్ చెయ్యడంతో, వారు యథావిధిగా పెళ్లిచూపులకి రమ్మని పిల్చి వెళ్లారు. ఆ తరవాత వో మంచిరోజు చూసి పెళ్లిచూపులు కానిచ్చాక పిల్లవాడి సమ్మతాన్ని తెల్సుకుని జోగారావుగారూ భార్యా, విజయవాడ వెళ్లి, మిగతా సంగతులన్నీ మాట్లాడి నిశ్చయపరుచుకు నొచ్చారు. ఇటు రాధ మూలకంగా గుట్టు బయటపడకూడదనుకుని తిరూ అటు అమ్మమ్మని తృప్తిపరిచే నిమిత్తం వారూ ఇలా



చెయ్యాకతప్పలేదు. రాజమ్మగారి తీయం కొర ణంగా అతిత్వరలోనే వో సుముహూర్తాన్న మురళీ. వళినుల పెళ్ళి అతి వైభవంగా జరిగిపోయింది.

'ఏదో అనుకోకుండా మా మురళి పెళ్ళయిపోయింది. ఇక మా రాధక్కూడా అయిందంటే—' అంటూ పెళ్ళివాడ వచ్చిన పార్వతమ్మగారితో మాటలు కది పారు రాజమ్మగారు.

'అవుతుంది మరీ, దేనికన్నా వేళ రావాలి' అంటూ ఆనందంగా ఉక్కి వ్వారు పార్వతమ్మగారు.

రఘుకూడా ఆ పెళ్ళిలో చాలా సరదాగా పాల్గొనడమేగాకుండా తమ కాలేజీ తరపున వచ్చినవారందర్నీ స్వయంగా ఆహ్వానించి కూర్చోపెట్టాల్సిన పనిని పూర్తిగా తను చూసుకున్నాడు. ఈడూ జోడుగా వుండడమే గాకుండా మిగతా అన్నింట్లలో నూ కూడా అమర్చినట్టు కుదిరిన ఆ జంటను చూస్తూంటే అదే వయసులోవున్న రఘు మనసూ సావా కొత్త కొత్త కాంతుల్ని రేకెత్తించి ఉద్రూత లాడించినా, అది వరకే కొన్ని ఆశయాలకు పూర్తిగా మన సులో తావిచ్చేసిన రఘు ఆ చపలత్వం నెప్పటికప్పుడు ఖండించేస్తూ, జయం చేకూర్చుకుందుకువిశ్వప్రయత్నం చేస్తుండే వాడు.

ఒక్క ఈ విషయంలో ఇప్పు డేలాగునో డవే కాదు అడుగడుగునా, అతన్ని అగ్ని పరీక్ష చేస్తూండే ఇటువంటి సంఘట

...తా తిన్నన్నో

శిబిరాలనీ, నవలలనీ, ఇలా ప్రతి దాటిల్లోనూ ప్రేమపేరట ఎన్నెన్నో అవి నీతి దృశ్యాల్ని కళ్ళముందు విప్పుతూండే ఇప్పటి వాతావరణంలో ప్రతివారూ మానసికంగానూ శారీరకంగానూకూడా దుర్బలులై పోతూంటే, అందుకు తోడు, ఆడా మగా, కలిసి మెలిసి చదవడంలోనూ, సంస్థల్లో పన్ను చెయ్యడంలోనూ, హృదయ దౌర్బల్యానికి లోనవడంలో తప్పేంవుంది?

అందులోనూ మెడికల్ కాలేజీలూ హాస్పిటల్సూ, ఇటువంటి చోట వుండేవారి సంగతి ఇక అడగ నవసరమేలేదు. శరీర తత్వాన్ని గురించిన పరిశోధనల్లో, రుగ్మ

## అతని లక్ష్యం

తలకు కారణాలూ, వాట్ల నివారింపులూ, మొదలైన అన్ని విషయాల్ని నిస్సంకోచంగా కలిసీ, మెలిసీ, చర్చించుకుంటూ వుంటారేమో. ఇక వారికిందుకు సంబంధించినఅరమరికలూ అభ్యంతరాలూ మొదలైన ఎటువంటి ఆటంకాలూ, ఆక్షేపణలూ తోచనే తోచవు.

'జగమెరిగిన త్యాగికి కసిగ్గెందు' కన్నట్టు. ఒకటి ఎంతసేపూ ఆ పరిశోధనల్లో అంతు కనుక్కోవాలనుకుంటూ, సర్వాన్నీ మరిచి అందుకే వారి శక్తి సామర్థ్యాల్ని ధారపోస్తూండంతో ఒక విధంగానూ, లేదా, ఆ పరిశోధనల్లో పాటు నిర్భయంగా తమలో కలిగిన వ్యామోహాలకి లొంగిపోతూ మరో విధంగానూ ఇలా రెండు తెగలుగా మారిపోతూండడం సహజం. అందులోనూ ఆ మొదటితెగననుసరించాలంటే ఎంతో మనోనిబ్బరం స్థిరత్వం కావాలిగనక అది అందరికీ పట్టుపడదు గాని, ఆ రెండోపద్ధతికి లోబడి కన్నూ మిన్నూ తెలియకుండా ప్రవర్తించి ఫలితాన్ననుభవించే సమయమప్పుడు బాధ పడుతూండేవారు అనేకమంది ఇక ఈ రెండు తెగలకీ చేరకుండా తమకి ఏది ఎంతవరకూ అవసరమో అంతవరకూ అలవరుచుకుంటూ సందర్భానుసారంగా సర్దుకుందుకు అలవాటు పడేవారు బహుకొద్దిమందేనని చెప్పొచ్చు అటువంటి వాతావరణంలోనే తనూవున్న రఘు ప్రయత్నం తను ఎలాగైనా మొదటి శ్రేణికి చెందగల్గాలని. అయితే పరిస్థితులతన్ని రెండో శ్రేణికి ఈడ్చేవిగా సిద్ధమవుతూ, అతన్ని దుర్బలుణ్ణి చేసేస్తున్నాయి; తను పరిశోధించవలసొచ్చే యువతులూ, ప్రతినిత్యం తనని చుట్టుముట్టి తనతో చెయ్యి, చెయ్యీ కలిపి పని చేస్తూండే సుందరాంగులూ. అడుగడుక్కీ ఇటువంటి సందర్భాలింకా ఎన్నెన్నో. ఎందువల్లో అది నిజంగానే జరుగుతూందో, తన మతిభ్రమో తెలియదుగాని వారంతా ఎప్పుడూ తనవేపు చూస్తున్నట్టూ, తనపరిచయంకోరి ఏదో నిమిత్తంగా పని కల్పించుకున్నని తనదగ్గర కొస్తున్నట్టే ఎప్పుడూ అతని కనిపిస్తూవుంటుంది. ఇన్నింటినీ, విదిలించుకుని ఎలాగో నిబ్బరంగా మసులుకుంటూవేవున్నా, 'అబ్బ! ఇంతమంది డాక్టర్లీ హాస్పిటల్లో వుంటూండగా వీళ్ళందరూ కక్షకట్టినట్టు తన్నే చుట్టుముట్టేస్తూంటారేం' అనుకుని ఒక్కొక్కసారి చాలా చిరాకుపడి పోతూండేవాడు కూడా.

ఒక్కొక్కసారి మరీ తన మనోనిగ్రహం బలహీనమైపోతూండడం తెల్సుకున్నప్పుడు 'మనం మన లక్ష్యాల్ని సాధించి తీరాలనుకునేటట్టయితే త్వరగా ఇక్కణ్ణుంచి తప్పుకోవడమే మంచిదేమో' అనిపిస్తూండేది కూడా అతనికి. అయితే తన లక్ష్యాలు సార్థకం అవాలంటే ఎక్కడైనా, ఇటువంటి హాస్పిటల్లోనేగా వుండితీరాలి తనూ. ఇలా మళ్ళీ తనలో తనే సర్దుకునేవాడు రఘు. **(ఇంకావుంది)**

---

**ఊరగాయ గుణాలు!**

# చేపల సామాన్య గుణము

చేపలలో అనేక రకాలున్నాయి. మొత్తం మీద చేపలకూరకు కొన్ని సామాన్య గుణాలున్నాయి.

తాజా చేపలకూర రుచిగా ఆరోగ్యకరంగా వుంటుంది. వీర్యపుష్టి నిస్తుంది. ఉష్ణశరీరులకు, కష్టపడి పనిచేసేవారికి అనుకూలంగా ఉంటుంది. చేపల్ని నూనెలో వేపడంకంటె నిప్పుసెగమీద కాల్చడం మంచిది. త్వరగా జీర్ణమవుతుంది. ధాతువులకు సత్తువ నిస్తుంది. దేహంలోని దుష్టపదార్థాలను తొలగించ డానికి తోడ్పడుతుంది.

మేహక్షయ, ఉబ్బసం వున్నవారికి మేలు చేస్తుంది. మేహాధిక్యతవల్ల హృదయానికీ, లివరుకు కలిగే నీరసాన్ని పోగొడుతుంది. అప్పుడు పట్టిన చేపల్ని ముక్కలుగా కోసి, నీరుల్లిపాయలువేసి నేతిలో వేపి తినడంశ్రేష్ఠం!

చేపలు కడిగిన నీరు (మురఖా) ప్రతిదినం తగినంత మోతాదులో త్రాగినట్లయితే నాగుపాము విషం, వెర్రికుక్క విషం అంత త్వరగా శరీరానికి బాధించదు. కాళ్ళు, చేతుల యొక్క కీళ్ళ నొప్పులను, శోధి నొప్పులను పోగొట్టడానికి తోడ్పడుతుంది!

చేపనూనె వీర్యపుష్టిని, దేహపుష్టిని యిస్తుంది. క్షయ, కార్శ్యము గలవారికిది మేలు చేస్తుంది. శైత్యం చేస్తుంది. కాక చేస్తుంది.

శరీరంలో ఏదైనా జబ్బుగాని, ఉబ్బుగాని, వాతరోగాని వున్నవారు ఏ చేపలను తినకూడదు. శ్లేష్మం చేస్తుంది. ఆలస్యంగా జీర్ణమవుతుంది. వాతం చేస్తుంది. దగ్గుని హెచ్చిస్తుంది.

అరటికాయ వేసి వండిన చేపలకూర దేహపుష్టినిస్తుంది. విరోచని బద్ధంచేస్తుంది.

కాకరకాయవేసి ఎండిన చేపలకూర మలబద్ధాన్ని పోగొడుతుంది. ఇంద్రియాల్ని వృద్ధి పరుస్తుంది.

పొట్లకాయవేసి వండిన చేపలకూర వీర్యపుష్టి నిస్తుంది. జీర్ణజ్వరాలు గలవారికి మేలు చేస్తుంది

ఆనపకాయ వేసి వండిన చేపలకూర బాగా మూత్రాన్ని జారీ చేయిస్తుంది. గురుత్వంగా వుంటుంది.

మామిడికాయ వేసి వండిన చేపలకూర శూల, మల మూత్రబద్ధము, నీరసంగల వారికి మేలు చేస్తుంది. పుష్టి, అగ్నిదీప్తి, బలమును వీటి నిస్తుంది.

చింతకాయవేసి వండిన చేపలకూర మలబద్ధాన్ని పోగొడుతుంది. అగ్నిదీప్తి నిస్తుంది.

పొన్నఆకువేసి వండిన చేపలకూర శ్వాస కాసలను, వాత శ్లేష్మంను హరిస్తుంది. విరోచనం కావిస్తుంది.

కాకరాకు వేసి వండిన చేపలకూర విరోచనం గావిస్తుంది. శైత్యం, చర్మరోగం, జ్వరం, క్రిమిరోగం, శ్లేష్మం గలవారికి మేలు చేస్తుంది. జఠరదీప్తి నిస్తుంది.

పంచకోల చూర్ణము వేసి వండిన చేపల కూర కఫవాతాలను అణుస్తుంది.

చేపల యొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు:—
1. నెయ్యి, 2. బాదమునూనె, 3. తేనె, 4. నల్లేరు, 5. మామిడిపండు, 6. నువ్వుల నూనె, 7. పెరుగుమీగడనీళ్ళు, 8. అల్లపు మురబ్బా, 9. సిరక, 10. గరమసాలా.

సేకరణ. **ఆకుండినారాయణమూర్తి.**

# వారఫలం

**5-2-1971 శుక్రవారం మొదలు**
**11-2-1971 గురువారం వరకు**

**మేషం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు [illegible]టాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం:** అన్నివ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిధునం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అలంకార వస్తువులు కొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కర్కాటకం:** సహాయంచేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. మీ ఆలోచనలు ఫలించగలవు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**సింహం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరుతాయి. విలాస వస్తువులు కొంటారు.

**తుల:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. మీకంటే పెద్దవారు కూడా కొన్ని వ్యవహారాల్లో మీ సహకారాన్ని కోరుతారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం:** వ్యాపారంలో ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు.

**ధనుస్సు:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. పైవారితో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో అనవసరమైన శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:** వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. పైవారితో వాదప్రతివాదాలు తగవు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అలంకరణ కోసం వ్యయం చేస్తారు.

**కుంభం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన ఇబ్బంది కలుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం:** కొన్ని వ్యవహారాల్లో మీ మందకొడితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. విలాస వస్తువులు కొంటారు.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

—మహేష్

మా పక్కింటి వాళ్ళమ్మాయి ఒక పైసా మింగిందట డాక్టరును పిలిపించి హడావిడి చేస్తున్నారు. పైసా బయటికితీయాలట వట్టి పిసినారులు






బంద్!

రేపు బంద్!

రేపు...అంటే...రేపే...అవును. బంద్ రేపు.

అందరి ఆలోచనలనూ ఆక్రమించుకొంది విషయం. కొందరు భయంతో బిక్క చచ్చిపోయారు. ఏం కాని పని జరుగుతుందో? ఏ చావు కబురు వినవలసి వస్తుందో? ఇవే వారి ఆలోచనలు.

మరి కొందరిలో ఉత్సాహం ఉరకలు వేస్తోంది. తమ అదృష్టం ఎలా ఉందో? అదృష్టం బావుండి పెద్ద గొడవ జరిగితే నాలుగు సామాన్లు తెచ్చుకోవచ్చు. ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. చెట్టిగారి కొట్లో బస్తాల నిండా బోలెడంత బియ్యం. ఇవి వాళ్ళ ఆలోచనలు. బంద్ రోజు ఓ అరబస్తాడు బియ్యం తీసుకుని రాలేక పోతామా? ఇదీ వీళ్ళ ధైర్యం.

మరో సెలవు. మరో ఆట విడుపు రోజు. హాయిగా నలుగురూ కలిసి పేకాట ఆడుకోవచ్చు. ఇది యన్. జీ. వో, ఆలోచన.

మొత్తానికి అందర్నీ కదిలించింది విషయం...బంద్!

కొడిగట్టి దీపం వెలగలేక వెలుగుతోంది, తాటాకుల సందుల్లోంచి గుడ్డి వెన్నెల గుడిసెలో పడుతోంది. అది గుడిసె కాదు. మట్టితో కట్టిన గోడలమీద తాటాకుల కప్పు. గాలివాన వస్తే, మాత్రం బయట నీరంతా లోపల్నే ఉంటుంది.

గుడిసెలో మూలగా కుక్కి మంచం. దానిమీద యాభై అయిదేళ్ళ బక్క పలుచని శరీరం. ఆ శరీరం తాలుకు వ్యక్తి రాఘవులు సిగరెట్ ఫ్యాక్టరీలో పని చేస్తుండేవాడు ఇదివరకు. ఈ మధ్యనే రిటైరయ్యాడు. ఆ సిగరెట్ కంపెనీ అతనికి పెన్షన్‌తోపాటు టి. బి. ని కూడా ప్రసాదించింది. ఎడతెరిపి లేకుండా వస్తోన్న దగ్గు తెరలను ఆపుకుందామని ప్రయత్నిస్తున్న రాఘవులు ఆయాసపడుతున్నాడు, ఆ కుదుపులకి మంచం కిర్రుమని చప్పుడు చేస్తోంది.

ఆరుబయట పడుకున్నాడు నరహరి. రాఘవులు సంతానం. మొదటి వాడూ అఖరి వాడూను. పుట్టగానే తల్లిని కోల్పోయాడు. పిల్లవాడిని కనిపెట్టుకునేందుకని నెల తిరక్కుండా మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు రాఘవులు.

మోహిరి నైట్ డ్యూటీ ముగించుకుని వచ్చేసరికి ఇంట్లో భార్య కనిపించలేదు. కుర్రాడుమాత్రం గుర్రు తీస్తుకోకుండా నిద్రపోతున్నాడు. 'పిల్లాడిని వదిలేసి ఎక్కడికి వెళ్ళినట్టు?' రాఘవుల కర్థం కాలేదు. గుడిసెలన్నీ వెదికాడు. అంతే మళ్ళీ ఈ నాటివరకూ కనిపించలేదు. రాఘవులకి పిల్లనిస్తామని కొందరు ముందుకు వచ్చారు. రాఘవులు అందుకు ఒప్పుకోలేదు.

నరహరి ఆలోచనల్లో రేపు మెదులుతోంది. రేపు ఏం చేయాలనుకున్నాడో ఏదో ఒకటి చేయాలి నరహరి అనే విద్యార్థి ఫలానా ఘనకార్యం చేశాడని తన పేరు బయటకు రావాలి. తన గౌరవం ఇనుమడిస్తుందప్పుడు. నరహరి ఆలోచనలిలా ఉన్నాయి.

'నరహరీ...' రాఘవులు ఆయాసంగా పిల్చాడు.

'...'నరహరికా పిలుపు వినిపించలేదు.

'నరహరీ!!...' శక్తినంతా కూడ దీసుకుని గట్టిగా పిల్చాడు రాఘవులు ఈసారి.

నరహరి ఉలిక్కి పడ్డాడు 'ఏందయ్యా...' లోపలికెళ్ళాడు.

రాఘవులుకి గొంతు ఎండుకు పోతోంది. మంచి నీళ్ళు కావాలతనికి. కాని నోటితో చెప్పలేక పోతున్నాడు. దగ్గు అడ్డం వస్తోంది. మంచినీళ్ళు కావాలన్నట్టు సూచిస్తూ చేతులతో సైగలు చేశాడు.

'నీళ్ళు కావాలా...?'

అవునన్నట్టుగా తల వూపాడు రాఘవులు.

'సానుండు...' మంచినీళ్ళ కుండ దగ్గరికెళ్ళాడు. ఖాళీగా ఉంది. 'నీళ్ళు కూడా లేవు' విసుక్కున్నాడు.

బయటకు వచ్చాడు.

కాసేపు ఆలోచించి పక్కనే ఉన్న గుడిసె కేసి నడిచాడు.

'రంగమ్మత్తా...' కీచుగొంతుకతో మెల్లిగా పిల్చాడు.

'ఎవరదీ...'

'నేను నరహరిని' జవాబు చెప్పాడు.

'నువ్వా నరహరీ...' నడివయసావిడ బయటకువచ్చింది.

'అయ్యేకి...' నరహరి మాటల్ని మధ్యలోఆపి ఆదుర్దాగా అడిగిందిరంగమ్మ. 'ఏమయింది?'

'దగ్గు ఎక్కువయింది...నీళ్ళు గావాలి'

'ఇస్తా...జరవుండు' లోపలి కెళ్ళింది.

నరహరికి సుబ్బులు గుర్తుకు వచ్చింది. సుబ్బులు రంగమ్మ కూతురు. పదహారణాల యవ్వనంలో ఉంది. అది పుట్టగానే నరహరి పెళ్ళాం పుట్టిందన్నారు. అప్పుడు అవుననుకొన్న నరహరి ఇప్పుడదా అదే అనుకుంటున్నాడు. సుబ్బులేం చేస్తోందో? లోపలికెళ్ళి చూస్తే...? ఛ...బాగుండదు. ...అత్త చూస్తే... పోనీ అత్త నడుగుదామా?...వద్దు...వద్దు...

'ఇదిగో' చెంబులో మంచి నీళ్ళతో వచ్చింది రంగమ్మ.

అందుకున్నాడు నరహరి. నీళ్ళుచల్లగా ఉండి వేళ్ళు కొంకర్లు పోతున్నాయి. వెన్నెల చల్లగా ఉండికూడా వేడి పుట్టిస్తోంది. గుడ్డివెన్నెల్లో అల్యూమినం చెంబు వెండిలా మెరుస్తోంది.

నరహరి కిరవై ఏళ్ళుంటాయి. కానీ

[illegible] ఎక్కువ వయసుగాను వాడిగా కనిపిస్తాడు. కసరత్ చేసిన శరీరం. దండల్లో కండలు నిండుగా ఉన్నాయి. స్కూల్లో చదువుతున్నాడు. అన్నేళ్ళ వాడైనా, ఇంకా స్కూలేనా అంటే' అదంతే మరి! నరహరి మాస్టార్లకి భయపడ్డం మాట అటుంచి అతడిని చూసి వాళ్ళు బెదరకుండా ఉంటే చాలు.

అలాంటివాడు నరహరి. చదువుకోడానికి కాకపోయినా స్కూలుకెళ్ళాలంటే భలే సరదా అతనికి. అల్లరి చిల్లరిగా తిరగడాని కంతకంటె మంచి అవకాశం లభించదని అతని అభిప్రాయం. స్కూల్లో అతనొక పెద్దనాయకుడు. సమ్మె జరపాలన్నా, ఏ విషయాన్నయినా ప్రతిఘటించాలన్నా అతను ముందుకురికేవాడు.

అందుకనే —

రేపు బంద్ అనగానే అతనిలో హుషారు కనిపిస్తోంది. తను ఈసారి ఏదయినా గొప్పపని చేయాలి. క్రితంసారి బందులో పోలీసులు కాల్పులు జరుపుతుంటే పక్కదార్లంబడి ఇంటికి పరుగెత్తుకొచ్చేశాడు తను. కాల్పులకి ముందున్న హుషారుకు బదులు భయంపుట్టింది. అందుకు మరుసటి రోజు మిత్రులందరూ తన్ని హేళన చేశారు. ఈసారి అల్లరి ఉధృతంగా చేయాలి ... అందరూ తనను మెచ్చుకోవాలి ...

ఇలా ఆలోచిస్తున్న నరహరికి నిద్ర ఎప్పుడు పట్టిందో తెలీలేదు.

* * *

తెల్లవారింది. కానీ ఎండలో వేడి లేదు. వెన్నెలలా చల్లగా ఉంది. చలికాలపు పిల్లగాలులు చలి పుట్టిస్తున్నాయి.

నరహరిలో ఉత్సాహం ఉరకలేస్తోంది. అప్పటికే స్నానం ముగించుకొని తయారయ్యాడతను. రాఘవులు వందుంపుల్లతో బోసినోట్లో ఉన్న పళ్ళను వెదుకుతున్నాడు.

'అయ్యా... నే పోతున్నా...' రాఘవులితో చెప్పి జవాబుకోసం ఎదురు చూడకుండా రంగమ్మ గుడిసెవేపు నడిచేడు.

'రంగమ్మత్తా' వినీ వినిపించనట్టు పిల్చేడు. ఆవేళకి రంగమ్మత్త ఉండదనీ, కూలికి పోతుందని నరహరికి తెలుసు. గుడిసెలో సుబ్బులు చీపురు పట్టుకుని కసువు వూడుస్తోంది.

'అమ్మలేదు' కుడిచేతో చీపురు పట్టుకుని ఎడంచేతో మొహం తుడుచుకుంటూ జవాబు చెప్పింది సుబ్బులు.

నరహరి ధైర్యంగా అడుగుపెట్టాడు.

'పొద్దున్నే ఎక్కడికి ఎళ్ళినావ్'

సుబ్బులడిగింది.

'స్కూల్కి'

'అదేంటి? ఇయ్యాల బంద్ కదా...?'

'వెళ్ళాలి...'

'మరయితే పుస్తకాలెప్పి?'

'ఇయ్యాల పాటన పరంలేదులే' మెల్లిగా గొణిగాడు. సుబ్బులు తనపని చేసుకోసాగింది.

నరహరి కలవరపడ్డాడు. అతను కలవరపడింది సుబ్బులడిగిన ప్రశ్నకి కాదు. ఆమె అందానికి. ఎదురుగా మిటాయి పెట్టి చేతులు కట్టివేసిన చిన్న పిల్లాడిలా ఉంది నరహరి పరిస్థితి.

అతనిలోని ఆవేశం వివేకాన్ని హత్య చేసింది.

'సుబ్బులూ...'

'ఏం...?' నిలబడింది సుబ్బులు.

ఆవేశంతో ఆమెను గుండెల కదుముకున్నాడు. సుబ్బులు బుగ్గల్ని నరహరి పెదవులు ముందు సుతారంగా ఆ తర్వాత బలంగా ముద్దుపెట్టుకున్నాయి. క్షణకాలం ఎదురుచూడని సంఘటనకి బిత్తరపోయి తర్వాత తేరుకుంది సుబ్బులు. నరహరి చెంపల్ని సుబ్బులి అరచేయి బలంగా తాకింది. ఆ దెబ్బకి నరహరిలోని మైకం దిగజారింది.

'సుబ్బులూ, నువ్ నా క్కాబోయే పెళ్ళానివి...' ఆవేశంగా అన్నాడు.

'ఛీ...నువ్వా నాకు మొగుడివి?' అన్న అర్థం వచ్చేచూపు చూసింది సుబ్బులు. నరహరి వెళ్ళిపోయేడు.

* * *

నరహరి స్కూలు చేరుకునేసరికి అందరూ అతనికోసం ఎదురుచూస్తున్నారు. అతను వెళ్ళగానే నినాదాలు మొదలయ్యాయి.

'జిందాబాద్...'

'...ముర్దాబాద్'

'జై...'

స్కూలు ముందున్నరోడ్డుమీద పోతున్న బస్సుల్ని ఆపివేశారు. స్కూలు బిల్డింగ్ బాగు చేయిస్తామని తెచ్చినరాళ్ళు దగ్గరే ఉన్నాయి. బస్సులమీద రాళ్ళవర్షం కురిసింది...

బస్సులో ప్రయాణం చేస్తున్నవారు భీతిపడి పోయారు. అసలే ప్రాణాలర చేతో పట్టుకుని ప్రయాణం చేస్తున్నారు. టికెట్ డబ్బులు పోతే పోయాయి. రాయి తగిలి కాలో, కన్నో, చేయో పోకుండా ఉంటే చాలని పరుగెత్తుతున్నారు.

బస్సు ఖాళీ అయింది.

మరునిముషంలో ...

అగ్నికి ఆహుతయి పోయింది. మింటి కెగిసే మంటల్ని విచిత్రంగా చూస్తూ అరుస్తున్నారు జనం.

'బంద్ కరో...' ఎవరో అరుస్తున్నారు గట్టిగా. మరుక్షణంలో మరికొన్ని గొంతుకలు అరిచాయి.

షాపుల షట్టర్లు దిగజారాయి.

---

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్® వల్ల ఆరోగ్యము కలుగును





ఫోస్‌ఫోమిన్
- శక్తిని పెంపొందించును
- ఆకలిని అధికము చేయును
- పచన శక్తిని హెచ్చించును
- శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువచేయును.






SQUIBB® TTT®
SARABHAI CHEMICALS

ఫోస్‌ఫోమిన్...
ఆకుపచ్చని పండ్ల రుచిగల
విటమిన్ టానిక్

Shilpi HPMA-35A/70 Tel

పొగాలని తప్పడానికి వచ్చిన ఫైర్ ఇంజన్ అడ్డంగా ఉన్నవాళ్లను తప్పించుకొని ఎలా వెళ్లాలో తెలీక తికమకపడిపోయి అగ్ని హోత్రుడు విజృంభించి ఐస్సును దగ్ధం చేస్తుంటే జాలిగా చూస్తోంది.

ఇద్దరాడపిల్లలు పుస్తకాలు పట్టుకొని అటువేపు వచ్చారు. వాళ్లనుచూసిన నరహరి దగ్గిరగా వెళ్లాడు. మరికొందరతన్ని అనుసరించారు.

'ఎక్కడికి ?'

ఆ ఆడపిల్లలిద్దరూ భయపడిపోయారు. కళ్లలో నీళ్లురావటం ఒకటే తరువాయి.

'స్కూలుకేనా? '

# బంద్

అవునన్నట్టుగా తలవూపారిద్దరూ.

'ఇవ్వాళ బంద్. ఈ సంగతి తెలీదా?'

జవాబు లేదు. నరహరికి పొద్దున్న మబ్బులు కొట్టినదెబ్బ గుర్తుకు వచ్చింది. ఆ క్షణం ఆడవాళ్లంటే ద్వేషం పుట్టింది. జేబులోంచి కత్తెర తీశాడు. వాళ్ల పుస్తకాలుతీసి దూరంగా విసిరేశాడు. పొడవయిన వాళ్ల జడల్నిచూసి వికృతంగా నవ్వాడు.

అతను చేయబోయేదని వాళ్ల కర్థమయింది. 'వద్దు...' బతిమాలుకొన్నారు. నరహరి తనపని ముగించిగాని వాళ్లను వదల్లేదు.



అటువైపుగా వస్తున్న రిక్షా అక్కడే ఆగిపోయింది. గొడవచూసి కాబోలు అందులోంచి ఇద్దరు దిగి ఎటో వెళ్లిపోయారు. నరహరి గుంపు రిక్షాని సమీపించింది.

'ఏయ్ రిక్షా'

'ఎక్కండి బాబూ.'

'ఇయ్యాల రిక్షా తొక్కకూడదని తెలీదా ?'

'రిక్షా తొక్కకపోతే కడుపు ఎలా నిండుతుంది బాబూ.'

'ఎలా నిండుతుందా ... ?' హేళనగా నవ్వారెవరో. అతనే జేబులోంచి చాకు తీసి రిక్షాటైరుని కోసేశాడు. ప్రతిఘటించబోయిన రిక్షావాడి వీపుమీద నాలుగు దెబ్బలు పడ్డాయి.

విజయగర్వంతో గట్టిగా నవ్వాడు నరహరి.

కళ్లలో నీళ్లు నింపుకుని రిక్షా తోసుకుంటూ వెళ్లిపోయేడు వాడు.

పోలీసువాన్ హారన్ వినిపించింది. 'పోలీసు లొస్తున్నారు.' ఎవరో అన్నారు. అందరూ కాళ్లకు బుద్ధిచెప్పారు. వాళ్లలో నరహరికూడా ఒకడు.

వ్యాన్లోనుంచి పోలీసులు బిలబిలమంటూ దిగారు. లాఠీలు లేచాయి. తుపాకులు శబ్దం చేశాయి.

వింత చూస్తున్న జనం లాఠీల పాలపడ్డారు.

* * *

సందుల్లోంచి పోలీసువాళ్ల బారినుంచి తప్పించుకొంటూ ఇంటికొచ్చిన నరహరికి గుడిసెముందు గుంపు కనిపించింది. మరింత వేగంగా ముందుకు పరుగెత్తాడు.

'అదుగో నరహరి...'

'ఏమయింది ... ?' గుంపులోకి చొరబడుతూ అన్నాడు నరహరి.

ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి స్తంభించిపోయాడు. నోట మాట రాలేదు. గుండె దడదడా కొట్టుకోసాగింది.

'నువ్వెళ్ళిం తర్వాత మీ అయ్యకి దగ్గు మరీ ఎక్కువయిపోయింది. రకతం బాగా కక్కిండు. సుబ్బులొచ్చి చెప్తే కూలి పని డిచి పరుగెత్తుకొచ్చినా ... ' రంగమ్మ చెప్పింది.

రఘుపతులు బయట అచేతనంగా పడుకునున్నాడు. పక్కబట్టలన్నీ రక్తంలో

తడిసి ఎరుపెక్కాయి. మెల్లిగా మూలుగు తున్నాడు.

నరహరి కళ్లలో నీళ్ళు తిరుగుతున్నాయి. అమ్మ పోయింతర్వాత తనని ప్రాణంలో ప్రాణంగా పెంచిన తండ్రిని అలాంటిస్థితిలో చూస్తోంటే అతనిగుండె తరుక్కుపోయింది.

'ఆస్పత్రికి తీసుకెళ్లాల లేకపోతే లాభం లేదు...' రంగమ్మతో ఎవరో అంటున్నారు.

'అవును ఆస్పత్రికి తీసుకెళ్ళాలి. రిక్షా కావాలి' రిక్షాకోసం పరుగెత్తాడు నరహరి. ఎక్కడా రిక్షా కనిపించలేదు. చివరికి వో చెట్టుకింద రిక్షాలో నిద్రపోతున్న రిక్షావాడు కనిపించాడు.

'బాబూ, రిక్షా'

వాడు లేచాడు, 'యాడికెల్లాలి'

'ఆస్పత్రికి'

'బజారుగుండా పోవాలి. రాను బాబూ'

'అవతల పానం మీదకొస్తోంది. నీకెంత డబ్బు కావాలన్నా ఇస్తాను' నరహరి ప్రాధేయపడు తున్నాడు.

'రానుబాబూ బజార్లో రిచ్చోళ్ళనితన్ని పెట్రుల్లు కొత్తున్నారంట ... మరో రిచ్చా చూసుకో...'

నిరాశగా వెనుదిరిగాడు నరహరి. పొద్దున్న తనుచేసినపని గుర్తుకువచ్చింది. తనకు ఈ శాస్తి జరగాల్సిందే. ఇంటి ముఖం పట్టాడు.

నరహరి గుడిసె చేరుకునేసరికి రాఘవులు యిహం వదిలిపెట్టేడు. రంగమ్మతల్లి ఏడుస్తూ ఉంది.

అంతా ముగించుకుని వచ్చేసరికి సాయంత్రమయింది. చీకటి మెల్లిగా పరుచుకొంటోంది. నరహరి గుడిసెముందు దిగాలుగా కూర్చున్నాడు. ఎదురుగా ఉన్న వీధిలాంతరు వెలగటంలేదు. పొద్దున ఎవరో రాయి విసిరి ఉంటారు. పగిలిపోయింది. కుక్కలు అరుస్తున్నాయి.

రేడియోలో వార్తలు వస్తున్నాయి. '...నేడు జరిగిన కాల్పులకు నిరసనగా మళ్ళీ రేపు బంద్...'

బంద్! నిలువెల్లా ఒణికిపోయాడు నరహరి. ●

# ఒక వారం విపరీతం

పౌలాక్షుడు

## ఘరానా దొంగలు!

చక్కగా, చూడ ముచ్చటగా ముస్తాబు చేసుకుని, రోడ్డు పక్కన నిలబడి వో అరిడజను మంది తాము నిరీక్షిస్తున్న కారు రాగానే జేబుల్లోంచి పిస్తోళ్ళు తీసి కారాపి, లోపలి వారిదగ్గరున్న 50 వేల రొఖ్ఖం తీసుకుని వారి కారు పైర్లు పీకేసి తావ. కారులో పారిపోయారట. ఇది చక్రధరపూరు, రాంచి మధ్య జరిగింది. ఆ వ్యాపారులు సరుకులు కొనుక్కోవడానికి రాంచి వెళ్తున్నారట పాపం.

## అనుకోని అనర్థం!

అన్ని మనమే చూసుకు చేసుకుంటుంటే అనుకోని అనర్థాలు వచ్చి అవతలి వారిని బాధిస్తున్నాయన్నది కోలారు నిరూపించింది. కోలారు గోల్డ్ ఫీల్డ్స్ పూరిలో విజనులు [మగవారే] ఎవరి గెడ్డాలు వారి గొరుసుకోవడం వల్ల తమ వ్యాపారం బాగా దెబ్బ తిన్నదని, ఈ ఎప్పెన్ని తట్టుకొని ఎత్తిరిల్లడక్క కష్టంగా వుందని ఆవూరి మంగలి వారు త్రో మహాజరురాసీ ముఖ్యమంత్రి వీరేంద్ర పాటిల్‌కు అందజేశారట. ఇట్టి పరిస్థితుల్లో తమ కేల్లలకు కనీసం స్కాలర్ షిప్పులయినా యివ్వాల్టి జీతం లేకుండా చదువుకునే అవకాశాలు కల్పించాలని వారు కోరారట.



## పొలంలో సారాయి వ్యాపారం!

తిరుపత్తూరు తాలూకా నారాయణపురంలో సీనన్ అనేఅతను తన పొలంలో సారాయి వ్యాపారం ప్రారంభించాడట. ఈ సారాకోసం వచ్చే జనం, త్రాగి తూలుతూ వెళ్ళే జనం సీనన్ పక్కపొలం కూడా త్రొక్కి నాశనం చేశారట. దాంతో ఆ పొలం యజమాని కృష్ణమూర్తి యీసారి సారా వ్యాపార విషయాన్ని పోలీసులకు తెలియజేశాడట. దాంతో సీనన్‌కు కోపం వచ్చి కత్తితో కృష్ణమూర్తి మెడమీద, చేతుల మీద గాయపరచాడట. సీనన్‌కి ప్రభుత్వం నాలుగేళ్ళ శిక్ష విధించింది.

## అపాయం!

సిగరెట్టు కాల్చడం అపాయకరమని, దానిని సూచించే విధానంగా సిగరెట్టు ప్యాకెట్ల మీద డేంజరు లేబిలు అంటించమని భారత ప్రభుత్వం ఆరోగ్యశాఖ దేశంలోని సిగరెట్టు కంపెనీల నన్నిటినీ కోరిందట.

## అతిమూత్రవ్యాధి-యోగాసనాలు

మందులకూ, మాకులకూ లొంగని అతిమూత్ర వ్యాధి కేవలం నలభై రోజులు యోగాసనాలకు లొంగిపోతుందని, ఆ రకంగా కొంతమందికి నయమయ్యిందని విశ్వాయతన్ యోగాశ్రమానికి చెందిన స్వామి ధీరేంద్ర బ్రహ్మచారి అన్నారట.




## హైవోల్టేజ్!

క్లాసు రూములో పాఠం చెప్తున్న ప్రొఫెసర్ సత్యన్ చక్రవర్తి అనే అయన్ను కొంతమంది నక్సలైటు అనబడేవారు పొడిచి చంపేశారు. విపరీతమైన కత్తి గాయాలతో ఆసుపత్రిలో చేరుస్తే ఆయన అక్కడ చనిపోయారట. ఈ దారుణం 12 వ తేదీన బేలూరులో జరిగింది.

కలకత్తాలో వో స్కూలు బస్సుకు, ఫెర్టిలైజర్ కార్పొరేషన్‌కు చెందిన వో జీపుకు ఎవరో ?) నిప్పు పెట్టారట. నక్సలైటుల గొడవలలో జాదవ్ పూర్‌లో అరుగురు డమ్‌డమ్‌లో నలుగురు [17వ తేదీ] చంపబడ్డారట. నక్సలైటు వారికి, సి. పి. యం. [ఐ] వారికి గొడవ లొచ్చాయటసల. ఆ ధర్మనగర్ కాలనీ ప్రాంతంలో నాలుగు శవాలు దొరికాయట. జాల్ పాయేకురికి చెందిన హార్టిగుట్‌లో సంయుక్త సోషలిస్టు పార్టీకి చెందిన ధుస్సింగ్ అనే ఆయనను ఆయన ఇంట్లోనే ఎవరో చిత్రహింస పెట్టి మరీ చంపారట.




కర్నూలు జిల్లా ఆస్పగడ్డలో వో లాయరు గారింటి మీదకు రెండు బాంబులు విసిరి పారిపోయారట వో పదకొండు మంది వ్యక్తులు. ఆ రెండు బాంబులూ పెరట్లోనే పడి, అక్కడే పేలటం వల్ల ప్రాణాపాయమేమీ లేదట.

హజారాజిల్లా రామ్‌నాజతోపాలో అసిస్టెంటు ఎద్ ఇన్స్‌పెక్టరు దీప్తి భట్టాచార్జి అని ఆమెను పవరోకత్తులతో పొడిచి పారిపోయారట. పోలీసు శాఖలోని ఆడవారి మీద చెయి చేసుకోవడం యిది మొదటి సారి అని తత్సంబంధ అధికారులు అన్నారు.




అమీర్‌ఖాన్ అండ్ పార్టీ, గుంటూర్లపాడు

ప్ర : మీకు మా వూరిలో అభిమాన సంఘము స్థాపించాలనుకున్నాము. ఏమంటారు?

జ : నాకు యెలాంటి ఆక్షేపణ లేదు. మీరు నాపై ప్రదర్శిస్తున్న అభిమాన ఆదరణలకు నేను మీకెంతో ఋణపడి వుంటాను. మీరు అభిమానసంఘం స్థాపిస్తున్నందుకు చాలా సంతోషం.

ప్ర : మిమ్మల్ని విమర్శించే పత్రికలను చూస్తే నాకు జాలివేస్తుంది. ఎందుచేతంటారు?

జ ; నాపై మీకున్న ప్రగాఢ అభిమానాన్ని సూచిస్తుంది. విమర్శలేని కళ రాణించదు, సద్విమర్శ అయితే, అందులోని సూచనలను అంగీకరిస్తాను.

ధనంజయపాత్రో, బరంపురం

ప్ర : మీకు చిన్నవయస్సులోనే పెద్ద పేరు వచ్చింది. దీనికి కారణమేమిటి?

జ : పెద్దల ఆశీర్వాదం; నా అదృష్టం, ప్రేక్షకుల అభిమానం.

ప్ర : మీ జీవితాశయం?

జ : అంతర్జాతీయ ఖ్యాతిపొందాలని వుంది. ఉత్తమ నటి బిరుదు సందుకోవాలని వుంది. మంచి మనిషిగా బ్రతకాలని వుంది. జయలలిత చనిపోయినా, ఆమె 'ఉత్తమురాలు, యెవ్వరికీ హాని తలపెట్టని సద్గుణశీల, పరోపకారి' అనెడి పేరు ప్రతి నోటా వినపడాలి. అదే నా జీవితాశయం.

ప్ర : మన సినిమాలన్నీ ప్రేమ చుట్టూ పరిభ్రమిస్తాయి. ఎందుకండీ అల్లాగ?

జ : ప్రపంచమే ప్రేమవలయం చుట్టూ తిరుగుతూ వుంది కదండీ.

ఏ. అనంతరావు, హారమండలం.

ప్ర : 'డూప్' అంటే ఏమిటి?

జ: ఇది తెలియదా. గ్యాప్ కొట్టడం. ఓహో! సినిమాల్లో 'డూప్'ను గురించి అడుగుతున్నారా. ప్రధాన పాత్రలను పోషించే వారికి అలాంటి పోలికలను గలిగిన వ్యక్తులను లాంగ్‌షాట్లలో వుపయోగిస్తారు. వారిని 'డూప్' అంటారు.

ప్ర: మీకు తమిళంలో విపరీతంగా డిమాండ్ వుండుటచే తెలుగులో నటించుటకు విరమించుకొనునట్లు ఒక పత్రికలో చదివితిని. అది ఎంతవరకు కరెక్టు?

జ : మీరు చదివిన పత్రిక పేరు చెప్పగలరా. నాకు తెలుగుభాష అన్నా, తెలుగు చిత్రాల్లో నటిందాలన్నా చాలా యిష్టం.

ప్ర: ఫాల్కే అవార్డు దేవకీ రాణికి యివ్వడం సమంజసమేనా?

జ : ఆమెకు అన్ని అర్హతలూ వున్నాయి.

పి. వి. ఆర్, శివకుమార్, హైద్రాబాదు—4,

ప్ర: మీ ఆటోగ్రాఫ్‌తో ఒక ఫోటో పంపుతారా? లేక యితర తారల్లాగే అవతల పడేస్తారా?

జ: నా అభిమానులకు ప్రత్యుత్తరాలు వ్రాయడానికి, ఫోటోలు పంపడానికని ప్రత్యేక కార్యదర్శిని నియమించి వున్నాను. ఆ సెక్రటరీకి అది తప్ప వేరే పని లేదు.

ప్ర: మీరు నాగేశ్వరరావు, రామారావు గార్లతో ప్రస్తుతం ఎన్ని చిత్రాల్లో నటిస్తున్నారు?

జ: ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ చిత్రంలో నాగేశ్వరరావుతో, 'కృష్ణసత్య'లో రామారావుగారితో నటిస్తున్నాను

ఎం. వెంకటేశ్వర్లు, కావలి.

ప్ర: మీరు నటించిన చిత్రమును తెరపై చూచునపుడు ఎలాంటి అనుభూతిని పొందుతారు?

జ : బాగా చెయ్యకపోతే, యెందుకు చెయ్యలేకపోయానా అని లోలోన కుమిలిపోతాను. బాగా చేసివుంటే, నేను యింత బాగా నటించానా అని సంతోషపడతాను.

కె. శివరామక్రిష్ణ ప్రసాద్. వేజండ్ల

ప్ర : ఇటీవల వివిధభారతిలో జయమాల ప్రోగ్రాం యిచ్చారుగదా. హిందీగాక మీకు యింకెన్ని భాషలువచ్చు?

జ ; తమిళం, తెలుగు, కన్నడం, ఇంగ్లీషు.

'ఎక్స్‌పో–70' లో మరవురాని సంఘటన యేదైనా జరిగిందా?

జ ; స్త్రీలను దేవతామూర్తిగా పూజిస్తారు. తమ కన్నతల్లిగా భావిస్తారు. 40 సంవత్సరాలు నిండిన స్త్రీ చే యెలాంటి పని చేయిందరు. ఒక కోటీశ్వరుడు ప్రతిరోజూ సాయంత్రం యింటికి రాగానే, తలుపుదగ్గరవున్న పనిమనిషి పాదాలను నమస్కరించి ఆమె దీవెనలు పొందడం నాకు పరమ ఆశ్చర్యాన్ని కలిగించింది. స్త్రీ అంటే ఆ దేశ ప్రజలకు అంతటి గౌరవం. ఈ సంఘటన నే నెన్నటికీ మరువలేను.

ప్ర : అన్నట్లు మీకు వివాహ ప్రయత్నాలు జరుగుతున్నట్లు విన్నను. అయితే తొందరలో మాకు భోజనాల్లన్నా మాట.

జ : అలాగా నాకు తెలియదే నాకే మీరుచెప్పేది న్యూస్‌గా కనుపిస్తుంది. ●



'విచిత్రదాంపత్యం'లో విజయలలిత, శోభన్‌ల కళ్యాణం.

# సినిమా

## ఎంకి-నాయుడుబావ

సి. ఐ. టి. నగర్‌లో వున్న చిత్ర కళా సంస్థకు వెళాను. అప్పుడు ఉదయం ఎనిమిదన్నర వుంటుంది. ఆఫీసు రూము బిజీగా వున్నట్టు పసిగట్టాను. కథపై చర్చ జరుగుతున్నట్టు ఆఫీసు బాయ్ చెప్పాడు. నేను వచ్చినట్టు ఒక చీటీ పంపాను. 'లోపలికి రమ్మన్నారండీ' అని కుర్రాడు చెప్పాడు. 'ఎసీ యింటరప్షన్' అంటూ ప్రవేశించాను. 'ఇట్ ఈజ్ ఎ ప్లెషర్, వెలకమ్' అని నవ్వుతూ ఆహ్వానించారు నిర్మాత నందమూరి సాంబశివరావుగారు. ఆయన కెదురుగా వున్న కుర్చీలో దర్శకుడు నందమూరి రమేష్, కథకుడు పినిశెట్టి స్క్రిప్టును తిరగేస్తూ, అక్కడక్కడ అండర్‌లైన్ చేస్తూ వచ్చారు. 'ఎప్పుడు ప్రారంభిస్తున్నారండీ, ఎంకి—నాయుడుబావ' చిత్రాన్ని, అని ప్రశ్నించాను. కాస్త టైం పట్టేట్టుంది. కలర్‌లో తీస్తే యెలా వుంటుందని ఆలోచిస్తున్నాము. అంతే అని చెప్పారు. బ్రహ్మాండమైన ఐడియా సార్ అని సాంబశివరావుగారిని మరింతరెచ్చగొట్టాను.

## కల్పనాశక్తి కల యువదర్శకుడు

'ఎంకి—నాయుడుబావ' కథను పినిశెట్టి బాగా రచించారని రచయితను పొగిడిన దర్శకుడు రమేష్ పిక్చర్ ఓపెనింగ్ సీను యెలా చిత్రీకరించదలచుకున్నది చెప్తుంటే, యేదో తెలియని థ్రిల్ కొట్టొచ్చినట్టు గోచరించింది. రమేష్‌కు చక్కటి కల్పనాశక్తి వుందని తెలుసుకోగలిగాను. 'విష్ యు గుడ్ స్పీడ్ సార్' అని అభినందించి, వస్తానండీ, అని రూము దాటబోతుంటే, నిర్మాత శ్రీ సి. ఎస్. రాజు యెదురొచ్చారు.

## శ్రీ విజయ వెంకటేశ్వర ఫిలిమ్స్ స్థాపన

'మీకు నూరేళ్లు ఆయుష్షు' అన్నాను. ఎందుకు? అని రాజుగారు ప్రశ్నించారు. 'మరేంలేదు. మీ ఆఫీసుకని బయల్దేరాను. మీరు ఫిబ్రవరిలో కొత్తచిత్రాన్ని స్టార్టు చేస్తున్నారట. వివరాలేమైనా చెప్తారా?' అని అడిగాను. 'యస్. ఫిబ్రవరి 20న షూటింగు విజయ స్టుడియోలో ప్రారంభమవుతుంది. శ్రీ రామారావు కథానాయక పాత్రను పోషిస్తారు. ఆయనకు జంటగా చంద్రకళ నటించగలదు. ప్రధాన పాత్రలను సావిత్రి, గుమ్మడి, సత్యనారాయణ, రాజబాబు ధరిస్తారు. ఈ చిత్రానికి పినిశెట్టి సంభాషణలను, చలపతిరావు సంగీతాన్ని, కె. ఎస్. ప్రసాద్ ఛాయను నిర్వహిస్తారు.



'అత్తను దిద్దిన కోడలు'లో రాజశ్రీ, హరనాథ్.

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!

MONITOR

పిల్లల శక్తి చదువుల్లో ఆటల్లో త్వరగా హరింపు అయిపోతుంది. శక్తిని తిరిగి సమకూర్చటానికి ప్రతి దినం వారికి బోర్న్‌విటా ఇవ్వటం మంచిది. క్యాడ్‌బరిస్ తయారుచేసిన రుచికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారల సంతులిత మిశ్రమం-బోర్న్‌విటా.




**శక్తి, ఉత్సాహం మరియు**
**రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా!**

Bensons/4664 Tel

## సినిమా

దర్శకుడు శ్రీ ఏ. సి. త్రిలోకచందర్!

# హిందీ రంగానికి పరిచయమవుతున్న తెలుగు దర్శకుడు

సి. ఎస్. రాజుగారితో మాట్లాడిన తర్వాత నేను, భారతీనగర్‌లోని మహేష్ పిక్చర్స్ ఆఫీసుకు వచ్చాను. అప్పుడు దర్శకుడు శ్రీ బి. ఎస్ నారాయణ క్రికెట్ కామెంటరీ వింటూ కూర్చునియున్నారు. ఆఫీసుగదిలోకి అడుగెట్టూ 'కంగ్రాచులేషన్స్' అంటూ చేయి చాపాను. 'వాట్ ఫార్' అని నావంక ఆశ్చర్యంగా చూచారు



'లాడీ రంగడు' చిత్రంలో ఒక దృశ్యం. నటీనటులు చలం, సులేఖలు

బి ఎస్. నారాయణ 'మీరు హిందీ పిక్చరును డైరెక్టు చేస్తున్నందుకు' అన్నాను.

'ఫిక్స్ సెన్సార్ ఇంటర్నేషనల్' నిర్మించనున్న 'ఫూల్ గులాబ్ కా' చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నాను. మార్చి నుండి షూటింగు వుంటుంది. 'సావన్‌బాదూన్' ఫేం సోనిక్ ఓమి సంగీతాన్ని సమకూర్చగలరు. తారాగణం మరొక పదిరోజుల్లో తేలుతుంది, అన్నారు.

'శ్రీదేవి' విజయవంతంగా ప్రదర్శింపబడింది గదా. తెలుగుచిత్రం రెండోది



# తియ్యని మామ

చందమామ రావె జాబిల్లి రావే!
కొండెక్కి రావె **న్యూట్రిన్** మిఠాయి తేవే!
చెవలాయ్ నడిగి తేవే,
**న్యూట్రిన్** టాఫీ తేవే!
తేరుమీద రావే! **న్యూట్రిన్** కాండీ తేవే!
క్యూట్, క్రంచ్, నావల్టీ
కూడా పట్టుక రావే!
చందమామ రావే!
**న్యూట్రిన్** మిఠాయి తేవే!






న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర).

## సినిమా

యెప్పుడు? అని ప్రశ్నించాను. 'స్క్రి యీజ్ రెడీ'. ఫిబ్రవరినుండి వుండొచ్చు షూటింగు. ఇదిగాక 'శ్రీదేవి'ని తమిళంలో మోహన్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్నారు. దానికికూడా నేనే దర్శకుడ్ని అని చెప్పారు.

## శోభన్ కొత్తనటన

'విచిత్రదాంపత్యం' చిత్రంలో శోభన్ బాబు నటన ఉత్తమస్థాయిలో వున్నట్లు తెలిసింది. ఈ కథలో కనిపించే పాత్రలన్నీ విచిత్రమనస్తత్వంకలవిగా కనిపించినా, చివరన ఒక చక్కటి నీతిని ప్రజలకు అందిస్తుంది. ఉషశ్రీ కథలో నూతనత్వం, అడుగడుగనా గోచరిస్తుంది. ప్రతిపాత్రకు ఒక పరమార్థం వుండడమే యీ కథలోని విశేషఆకర్షణ.

సావిత్రి, గుమ్మడిగార్ల దాంపత్యం ఒక ప్రక్క; విజయనిర్మల, శోభన్‌గార్ల వైవాహిక జీవితం మరోప్రక్క యెదురు బొదురుగా వున్నట్లు కనిపించి, చిత్రం ముగిసే సమయానికి 'విచిత్రదాంపత్యం' చిత్రాతిచిత్రంగా నిర్మింపబడిందీ అన్పిస్తుంది. ఈ చిత్రానికి ఛాయాగ్రహణాన్ని చేపట్టిన సుకదేవ్‌కు ముమ్ముందు మరింత

### మీకు తెలుసా?

నటి వైజయంతిమాల యికపై సినిమాల్లో వేషాలు వెయ్యదట.

నటి సరోజాదేవిని మైసూరులోని వివిధ పార్టీలు తమ అభ్యర్థిగా ఎలెక్షన్‌లో పోటీ చెయ్యమని అడుగుతున్నారట.

నటి షర్మిలాటాగూర్ భర్త నవాబ్ ఆఫ్ పటౌడి హర్యానా నియోజకవర్గంనుండి పోటీ చేస్తారట.

నటుడు ఎం. జి. రామచంద్రన్ డి. ఎం. కె. అభ్యర్థిగా రాబోయే ఎలెక్షన్‌లో తన పాత నియోజకవర్గంనుండి (సెంట్‌థామస్‌మౌంట్) పోటీ చేస్తారట.

నటుడు శివాజీ గణేశన్ సంస్థా కాంగ్రెస్ టిక్కెట్టుపై నిలబడతారని తెలుస్తోంది.

వెలుగు కనిపించి తీరుతుంది. కథలో బలం, నటీనటుల నటనా ప్రభావం, సాంకేతిక నిపుణుల సహకారం సమపాళ్లలో రంగరించుకున్న 'విచిత్ర దాంపత్యం' ఆంధ్ర ప్రేక్షకులకు విచిత్ర అనుభూతిని కలిగించి తీరుతుంది. అనిల్ ప్రభాస్ విడుదలచేస్తే యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. నిర్మాత చిన్నపరెడ్డి

## విలాస పురుషుడు అక్కినేని

దురాశ ఒక వ్యక్తిని ఎంత దూరానికయినా తీసికెళ్తుంది. డబ్బుకోసం,



'అందరికీ మొనగాడు'లో జెన్నీ రాజశ్రీ నిర్మల, కృష్ణ

స్వార్థ ప్రయోజనంకోసం ఒక వ్యక్తి యెంతటి దురాగతాన్నయినా చేస్తుంది. సూర్యకాంతం మనస్సుకూడా అలాంటిదే. అందుకే హీరో నాగేశ్వరరావుకు చెందిన ఆస్తిపాస్తులను కాజెయ్యడానికి ఆయనకు యీ ప్రపంచంతో ప్రమేయం లేకుండా చేసింది. చిన్నప్పట్నుండి ఆయన్ని వ్యసనాలకు బానిసగా తయారు చేసింది. విశాలమైన భవంతిలో మేడపైనున్న ఒక ప్రత్యేకమైన గదిలో అక్కినేనికి బస ఏర్పాటు చేసింది. ఆయనకు విలాస



'నిండుదంపతులు'లో ఒకజంట వేశం.

నటులతో కాలక్షేపం చెయ్యడం, సదా సర్వదా విస్కీ సేవించడంతప్ప మరొకటి తెలియదు.

ఒకరోజు రాత్రి హీరో నాగేశ్వరరావు మంచి నిషాలోవున్న సమయంలో కొంటె చూపుల మిటారి, తళుకుబెళుకులవయ్యారి అయిన జయకుమారి హుషారుగా పాడ సాగింది, ఏమని?

కొంటెచూపు లెందుకు లేరా
జంటి తేనె లందిస్తారా

## సినిమా

నీవు నాకు తోడైవుంటే
లోకాలే గెలిచేస్తా రా—అంటూ నాగేశ్వరరావును నవ్వించి, నవ్వించి, నమ్మించ డానికి ప్రయత్నిస్తుంది. ఆయన పూరు కున్నాడా?

కన్ను కలిపి నవ్వించేవు
వెన్నలాగ కరిగించేవు
నిన్నుచేరి నీవైపోతే
నన్నుచూసి నవ్వేపోవు.

అని జయకుమారిని తన బాహు బంధాల్లో యిముడ్చుకుంటాడు. 'కట్' అన్నారు దర్శకుడు ప్రత్యగాత్మగారు ఈ రసవత్తరమైన సన్నివేశం విశ్వభారతి ప్రొడక్షన్స్‌వారి మొదటి చిత్రంలో కని పిస్తుంది. శ్రీ రాధాకృష్ణమూర్తి నిర్మి స్తున్న యీ చిత్రానికి ముళ్లపూడి కథ, పాటలను సముద్రాలవారు, సంగీతాన్ని చలపతిరావు, ఛాయను రామకృష్ణరావు, శిల్పాన్ని, జి. వి. సుబ్బారావు నిర్వహించే యీ చిత్రం త్వరలో నవయుగాద్వారా విడుదలవుతుంది. చిత్రంలో కనిపించే యితర ప్రధాన పాత్రలను జమున, గుమ్మడి రాజబాబు, రావికొండలరావు, నరసింహా రావు, ఝాన్సీలు పోషిస్తున్నారు.

## రైతుబిడ్డగా ఎన్. టి. రామారావు

'పల్లెటూరిపిల్ల'వంటి చక్కటి సాంఘిక చిత్రాన్ని ఆ రోజుల్లోనే అందించి ఘనవిజయం సాధించిన బి. ఏ. సుబ్బా రావు మరలా పల్లెసీమకు చెందిన ప్రజ్వల సాంఘిక గాధను 'రైతుబిడ్డ' రూపంలో తెలుగు ప్రేక్షకులకు అందిస్తున్నారు. నేటి సంఘంలో అన్యాయ అక్రమాలను అరికట్టడ మెలా? నీతి నిజాయితీలు యెంతవరకు వున్నాయి? సంఘ దౌర్బల్యానికి కారకు లెవరు? మంచితనం విలువెంత? అనేది చిక్కుప్రశ్నలకు సరయిన సమాధానం 'రైతుబిడ్డ' చిత్రం. కథ సుబ్రహ్మణ్యం, మాటలను పినిశెట్టి వ్రాసిన ఈ సమస్యాత్మక సాంఘికచిత్ర లోని ప్రధాన పాత్రలను ఎన్. టి. రామా రావు, జగ్గయ్య, రాజనాల, సత్యనారాయణ రాజబాబు, అల్లురామలింగయ్య, నా రాయణమూర్తి, వాణిశ్రీ, శాంతకుమా ఛాయాదేవి, అనురాధ, ప్రసన్నరాణి పోషిస్తున్నారు. కోట్ల వెంకటరామయ నిర్మించే రైతుబిడ్డను బి. ఏ. సుబ్బా రావు సర్వజన రంజకంగా చిత్రీకరి స్తున్నారు.

## బంగారుతల్లిగా జమున

సినిమాలు అందరూ తీస్తా

## సినిమా డైరీ

- హైదరాబాదులో అక్కినేని నాగేశ్వరరావు అధ్వర్యంలో ఆంధ్రప్రదేశ్ సినీ ఆర్టిస్ట్స్ అసోసి యేషన్ స్థాపించబడింది.
- కాకినాడ సాంస్కృతిక సంఘం యొక్క థియేటరు నిర్మాణ సహాయార్థం కాకినాడలో ఫిబ్ర వరి 9న స్టార్‌నైట్ ప్రోగ్రాము యేర్పాటు చెయ్యబడింది ప్రముఖ నటుడు ఎన్ టి రామా రావు తమతోటి నటీనటులతో యీ స్టార్‌నైట్ పండుగలో పాల్గొంటారు.
- సురేష్‌మూవీస్ వారి 'ప్రేమనగర్' కలర్ చిత్రం షూటింగు వాహినీలో జనవరి 22న ప్రారంభమైంది. నాగేశ్వరరావు, వాణిశ్రీ, రాజబాబు, సత్యనారాయణ, శాంతకుమారి పాల్గొన్న సన్నివేశాలను కె. ఎస్. ప్రకాశరావు చిత్రీకరించారు 22 నుండి 30 వరకు మొదటి షెడ్యూలు జరుగుతుంది.
- నవభారత్ మూవీస్ యొక్క అవుట్‌డోర్ షూటింగు జనవరి 16 నుండి 21 వరకు ఎల్లాయ పాలెం వద్ద జరిగింది. నాగేశ్వరరావు పాల్గొన్నారు. తాతినేని రామారావు దర్శకుడు.
- శ్రీ త్రివిక్రమరావు కలర్‌లో నిర్మిస్తున్న 'శ్రీకృష్ణసత్య' షూటింగు కె వి రెడ్డి దర్శకత్వంలో జనవరి 22న ప్రారంభమైంది నాయకుడు ఎన్. టి. రామారావు
- ఉత్తమచిత్రవారి 'మనసు—మాంగల్యం' శ్రీ ఫిలింస్ ద్వారా జనవరి 28న విడుదలవు తుంది. ప్రత్యగాత్మ దర్శకుడు నాగేశ్వరరావు, జమున, జగ్గయ్య ముఖ్య పాత్రధారులు.

వదికాలాలపాటు మనస్సులో మెదిలేలాగా సినిమాలు తీసేవారు చాలా అరుదు' అలాంటి అవకాశం 'బంగారుతల్లి 'నిర్మాత హరిబాబుకు దొరికింది.

'బంగారుతల్లి' ఒక ఆదర్శ మహిళకు సంబంధించిన వుదాత్తగాధ. తల్లికి బిడ్డలు ముఖ్యం. బిడ్డలకు తల్లి ప్రాణం, దైవంకూడా. కాని పరిస్థితుల ప్రభావం వల్ల దేశంయొక్క మానాభిమానాలు మంటగలిసిపోయే తరుణం అసన్న మయితే, కన్నబిడ్డలకన్నా మిన్నఅయినది మాతృభూమి. ఆ దేశంకోసం తన ప్రాణం కూడా త్యాగం చెయ్యడానికి ముందంజ

## కొత్త రికార్డు

'విచిత్రదాంపత్యం' చిత్రంలో 'శ్రీదేవి శ్రీదేవియే' అనే పాట ఒకటుంది. ఈ పాటలో మొత్తం 182 షాట్స్ వున్నాయి. ఉదయం 9 నుండి మధ్యాహ్నం 1 గంటవరకు జరిగిన షూటింగు షెడ్యూలులో కెమెరామెన్ సుకదేవ్ వివిధ భంగిమల్లో 72 షాట్స్‌ను తీసాడు. విజయనిర్మల. విజయలలితలు పోటీగా పాడే ఈ పాటను హీరాలాల్ కంపోజిషన్‌లో ఛాయాగ్రాహకుడు సుకదేవ్ 1½ కాల్‌షీట్లలో ముగించి పరిక్రొత్త రికార్డును సృష్టించాడు. ఈ పాట 'విచిత్రదాంపత్యం'లో హైలైటుగా వుంది. —టి. ఆర్ ఎస్.

వేసిన ఒక వుత్తమ స్త్రీయొక్క పవిత్ర గాథయే 'బంగారుతల్లి' చిత్రం.

'మదర్ ఇండియా'ను చిత్రీకరణలో నయితేనేమి, నటనవిషయంలో నయితే నేమి 'బంగారుతల్లి' మరపించగలదని రషస్ చూపిన వాళ్ళందరి అభిప్రాయంగా వుంది. అఖిలభారత ప్రశస్తి నందుకున్న తాపీచాణక్య దర్శకత్వ ఘనం ప్రతి ఫ్రేములో కొట్టొచ్చినట్టు కనిపిస్తుందట. అసభ్యశృంగారమో, అశ్లీల పద ప్రయోగమో మచ్చుకయినా కానరాని చిత్రంలో. ఇది.

—శ్రీనివాస్

అవి...ఇవి:

## సంక్రాంతి వేడుకలు

బెంగుళూరులోని తెలుగు విజ్ఞాన సమితి ఆధ్వర్యంలో ఈనెల 13, 14 తేదీలలో సంక్రాంతి నాటిక పోటీలు జరిగినవి. ఇందులో ఆంధ్రకళాసమితివారు సమర్పించిన అల్లూరి సీతారామరాజు ఉత్తమనాటికగా ఎన్నికైంది. రెండవ ఉత్తమ నాటికగా ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ అఫ్ సైన్సువారు చేసిన మంచు తెర మూడవ ఉత్తమ నాటికగా తెలుగు మిత్రులు [ఇ. టి. ఇ.] వారి రిహార్సల్స్ ఎన్నికైనవి. ఈ నాటికలకు డా. ఎస్. భగవంతంగారు ప్రారంభోత్సవం జరిపారు. శ్రీమతి కృష్ణకుమారి కైలాస్‌గారు బహుమతి ప్రదానం జరిపారు. ఎ. వి.




రాల్ఫిన్ జేమ్స్ పిహెచ్.డి.

## మనగురించి మనం తెలుసుకోవటం!

మనలో అనుభూతి, వైఖరి, ఆకలి లాంటివి బాహ్యంగా తెలియవు. అంతరంగికంగా అనుభవిస్తూ ఉంటాం. మనం సంతోషంగా ఉన్నా, ఆకలిగా వున్నా అంతర్‌సంజ్ఞల ననుసరించి మన మెలా ఉన్నామో—ఏం కావాలో చెబుతూ వుంటాం.

కేవలం ఈ అంతర్ సంజ్ఞలమీదే మనం ఆధారపడి జవాబివ్వడంపై శాస్త్రజ్ఞులు కొన్ని ప్రయోగాలు చేశారు.

లోపలి అనుభూతిని బహిర్గతం చెయ్యడానికి ముఖ కవళికలు ఉపయోగపడతాయి. దానినిబట్టి మన మెలా ఉన్నామో, మనం ఏ మాలోచిస్తున్నామో ఇతరులకి తెలుస్తుంది.

ఈ ఉదాహరణ చూడండి—ఒక గృహిణిని మీ ఆయనకి బ్రవున్ బ్రెడ్ అంటే ఇష్టమేనా? అని అడిగాం అనుకోండి. అప్పుడావె 'ఇష్టమే అనుకుంటాను అదే ఎక్కువగా తింటుంటారు—'అని సమాధానం ఇవ్వవచ్చు. బాహ్యంగా తెలుసుకున్నందువల్ల వచ్చిన సమాధానం ఇది.

### కొత్త పరిజ్ఞానం

అదే ప్రశ్నని ఆ దర్జీని కూడా వేస్తే నష్టమయితే అయివుంటుంది నేనది బాగా తింటాను—అని సమాధానం రావచ్చు. బ్రవున్ బ్రెడ్ అంటే ఇష్టమని చెప్పడానికి అతను బాహ్య సంబంధమైన సంజ్ఞనే ఆధారం చేసుకుని వుంటాడు.

ఇలా ఆలోచించడాన్ని స్వయం దర్శన ప్రమేయము అంటారు. ఇలాంటి వైఖరిని నమ్మడానికి సైకాలజిస్టులు కొత్త పరిజ్ఞానంలో పరిశోధిస్తున్నారు. ఓపికగా లావుగా వుండేవాళ్లు ఎక్కువగా ఎందుకు తింటారు? అనే విషయం తెలతెల్లమైంది.

డాక్టర్ షాష్టర్ అనే అమెరికా మనస్తత్వవేత్త లావుపాటి వాళ్లు కడుపులో అంతర సంజ్ఞల కంటె బాహ్యమైన సంజ్ఞలకి ఎక్కువగా దాసులై ఉంటారని చెప్పారు. ఒక మంచి ప్రయోగం ద్వారా దీనిని పరీక్షించి చెప్పారాయన.

కొందరిని ఒక అరగంట సేపు ఏ పనీ లేకుండా ఒక గదిలో కూర్చుండబెట్టారు. అందులో ఒక గడియారం కూడా ఉంచారు. ఆ అరగంట అయింతర్వాత ఆ గడియారం కొందరికి నెమ్మదిగా తిరుగుతున్నట్టుగాను మరికొందరికి వేగంగా తిరుగుతున్నట్టుగాను కనిపించింది. మరో ప్రయోగంలో మామూలుగా వుండే మనుషుల్ని—లావుపాటి మనుషుల్ని కూర్చోబెట్టి తినమన్నారు. లావుగా ఉండే వాళ్లు ఎక్కువగా తిన గల్గారు.

ఎంత రుచికరమైన పదార్థాలయినా సన్నపాటి వాళ్లని చలింప చెయ్యలేవు. కాని, లావుగా ఉండేవాళ్లు వాటిని తిన నురుగుతారు అని కొన్ని ప్రయోగాలవల్ల సుబోధకమైంది.

మీరు సన్నబడాలంటే గడియారాన్ని చూసి తినడంకంటే అంతర్ సంజ్ఞలని గుర్తించి తినడం మేలైన పద్ధతి.

( కాపీరయిటు )

## రాజధానికబుర్లు

(7 వ పేజీ తరువాయి)

టాక్సీలు క్యూలో వస్తాయి. మీరనగానే మీ టాక్సీ మీకు దొరుకుతుంది. ఈ మాత్రం ఏర్పాటును ఆంధ్ర ప్రదేశ్ రవాణాసంస్థల, ట్రాఫిక్ పోలీసు చేయలేక పోయారు. హైదరాబాదు స్టేషను ఆవరణలో రైళ్లు వచ్చే సమయానికి టాక్సీలు ఎందుకుండకూడదో అర్థం కాదు.

టాక్సీ డ్రైవర్ల బాధకూడా లేకపోలేదు. నగరంలో టాక్సీరేట్లున్న దాదాపు పదిసంవత్సరాల క్రితం రోడ్ రవాణా అధికార్లు నిర్ణయించారు అప్పటికీ ఇప్పటికి పెట్రోలుధర బాగా పెరిగింది. పోలీసు మామూళ్లు ఉండనే ఉన్నాయి. ఇతర ఖర్చులు పెరిగాయి. బొంబాయి, ఢిల్లీ, కలకత్తాల కంటే హైదరాబాదు టాక్సీరేట్లు చాలా తక్కువ, ఈ తక్కువ రేట్లు తమకు గిట్టుబాటు కావడం లేదని, టాక్సీ యజమానులు గొడవ చేస్తున్నారు. ప్రభుత్వం పట్టించుకొనడం లేదు. ఇందువల్ల తగినంత మంది టాక్సీ సర్వీసులో పెట్టుబళ్లు పెట్టడం లేదు దీని ఫలితం మరొకటి ఏమిటంటే ప్రవేటు టాక్సీల సంఖ్య పెరగడం. మీకు స్వంత అంబాసిడర్ ఉంటె ప్రవేటు టాక్సీగా నడపండి. అన్నిఖర్చులు పోను రోజుకు ముప్ఫైనుంచి ఏభై రూపాయలుదాకా గిట్టుబాటవుతాయి. ఆటో రిక్షాల విషయం కూడా అంతే. వీటి స్టార్టింగు రేటు 25 పైసలు, తరువాత ప్రతి కిలోమీటరుకు ఐదు పైసలు చొప్పున మీటరు చూపుతుంది ఈ రేటును హెచ్చు అనలేము. ఒక్కొక్కప్పుడు సైకిలు రిక్షాలో పోవడం కంటే ఆటోను తీసుకొనడం చవకనిపిస్తుంది.

కాని ఈ టాక్సీల ఆటోల జులుం తగ్గాలంటే ఉపాయం ఒకటే వాటి సంఖ్యను పెంచాలి. సంఖ్య పెరగాలంటే అది లాభసాటి వ్యాపారంగా ఉండాలి ఇదేమీ చేయలేకపోతే కనీసం టాక్సీ డ్రైవర్ల సహకార సంఘటలను బాగా పెంపొందించాలి. అప్పుడైనా ప్రవేటు యజమానుల లాభాశ పరిమిత మవుతుంది. రవాణా అధికారులు వేయి టాక్సీలు వేయిఆటోలు ఉండాలని నిశ్చయించార. కాని 889 టాక్సీలు 890 ఆటోలు మాత్రమే ఉన్నాయి. లైసెన్సుల కోసం ఎవరు దరఖాస్తులు పెట్టుకున్నా ఆమోదిస్తామని, అధికార్లు అంటున్నారు. కాని దరఖాస్తుదార్ల కొరత కనుపిస్తున్నది.

—వి. నాగేశ్వరరావు.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.